Regd. No. H.N.L. 18

28-5-1993 శుక్రవారం 14 పేజీలు సంపుటి 64 సంచిక 22 వెల : రు. 2.00

# జమీన్‌రైతు

స్థాపకుడు : నెల్లూరు వెంకట రామానాయుడు

## కోట్లపక్క లో చెన్నా బల్లెం

డాక్టర్ మర్రి చెన్నారెడ్డి తమిళనాడు గవర్నర్‌గా నియమితులయ్యారు. రాజస్థాన్ గవర్నర్‌గా డాక్టర్ పాల్ అనేక వివాదాల్లో కూరుకు పోయారు. రాజస్థాన్ కాంగ్రెస్ పార్టీ నాయకులతో సహా ఇతర ప్రతి పక్షాలన్నీ సమైక్యమై చెన్నా తొలగింపుకు ఆందోళన చేస్తున్న నేపథ్యంలో తప్పనిసరి పరిస్థితుల్లో చెన్నారెడ్డిని తమిళనాడుకు బదిలీ చేయక తప్పింది కాదు. రాజస్థాన్‌లో రాష్ట్రపతి పాలన ఉన్న దృష్ట్యా అక్కడ గవర్నర్‌దే రాజ్యం కాబట్టి రాజస్థాన్ వదలి వెళ్లేది లేదని చెన్నా భీష్మించారు. త్వరలో తమిళనాడులో కూడా జయ ప్రభుత్వాన్ని డిస్మిస్ చేయనున్న దృష్ట్యా తమిళనాడు గవర్నర్‌గా వెళ్లాల్సిందిగా ప్రధాని పివి నరసింహా రావు ప్రత్యేక దూత ద్వారా చెన్నాకు సందేశం పంపారట. జయ ప్రభుత్వం పోతే ఇక

కొరవ 10 వ పేజీలో

# అవినీతి మంత్రుల జాబితా తయారౌతుందా?

రాష్ట్ర మంత్రి వర్గ విస్తరణ ఎప్పుడు జరుగుతుందో కానీ మంత్రుల్లో మాత్రం 'అభద్రతాభావం' ఎక్కువైపోయింది. మంత్రి వర్గ విస్తరణలో పెద్ద సంఖ్యలో మైనస్‌లు, కూడికలుంటాయని ప్రచారం జోరుగా

**సంతోష్‌రెడ్డి ఇల్లు స్వయంగా చూడడంలో ఆంతర్యం?**

జరుగుతుండటంతో ఎవరుంటారో... ఎవరు పోతారో అంతుబట్టక మంత్రులు తలలు బాదుకుంటున్నారు. పాణ్యం ఎన్నికకు ముందు కంటే ఎన్నిక అయ్యాక ముఖ్యమంత్రి వైఖరిలో వచ్చిన మార్పుకు మంత్రులు నివ్వెర పోతున్నారు. పాణ్యం ఎన్నికకు ముందు మంత్రుల పట్ల మర్యాదగా, ఆప్యాయంగా వున్న ముఖ్యమంత్రి ఇటీవలి నుంచి మంత్రులంటే చేతకాని వాళ్లుగా, పనికి రాని వాళ్లుగా విసుక్కుంటున్నట్లు మంత్రుల భోగట్టా. దీనికి తోడు మంత్రుల ఆస్తుల వివరాలను ముఖ్యమంత్రి ఇంటలిజెన్స్ వర్గాల ద్వారా మదింపు చేస్తున్నట్లు సమాచారం అందటంతో చాలా మంది మంత్రులకు కునుకు పట్టడం లేదట. నగరంలో ఎమ్మెల్యేల కాలనీలో నిర్మాణంలో వున్న ఇళ్ల విలువల్ని అంచనా వేస్తున్నట్లు ప్రచారం జరగటంతో ఒకరిద్దరు మంత్రులు నిర్మాణపు పనుల్ని అర్ధాంతరంగా నిలిపి వేస్తున్నారట. ముఖ్యమంత్రి ఇంటి పక్కనే మంత్రి సంతోష్ రెడ్డి ఇల్లు కడుతున్నారు. ఒక రోజు సంతోష్ రెడ్డి వచ్చి నిర్మాణపు పనుల్ని చూస్తుండగా పక్క ఇంట్లోనే వున్న ముఖ్యమంత్రి చకా చకా సంతోష్ ఇంటికి నడుచు కుంటూ వచ్చారట. ముఖ్యమంత్రిగారి గుండెలు బరువెక్కాయట. "మరేంలేదు ఇల్లు కడుతున్నావు కదా చూసి వెళ్దాం అని

**మంత్రులపై ముఖ్యమంత్రి విసుగుకు కారణం?**

వచ్చా- పెద్దిల్లే కడుతున్నావు బాగుంది" అంటూ ముఖ్యమంత్రి భుజం చరిచి వెళ్లడంతో ఆంతర్యం అంతుబట్టకసంతోష్ రెడ్డి మధన పడుతున్నట్లు భోగట్టా. ఈ సంఘటన తర్వాత కొందరు మంత్రులైతే నిర్మాణంలో వున్న తమ ఇళ్లకేసి కూడా ముఖం చూపించటంలేదు. ఎమ్మెల్యే కాలనీలో ఒక విప్పుగారు కట్టిన ఇల్లు చూసి విస్తుపోయిన మరో విప్పు అంతకంటే పెద్ద ఇంటికి ప్లాను వేసిన సంగతి కూడా ఇంటలిజెన్స్ వర్గాలు ముఖ్యమంత్రికి చేరవేశాయని అంటున్నారు. రాష్ట్రంలో అవినీతి, అసమర్థ పాలన లేకుండా చేస్తానని ముఖ్యమంత్రి పదే పదే ప్రకటించడం మంత్రులకు కొరుకుడు పడటం లేదు. అసమర్థ, అవినీతి మంత్రుల చిట్టా తయారైందని, మంత్రి వర్గ విస్తరణకు ముందు ఈ చిట్టాను పరిశీలించి ముఖ్యమంత్రి మార్పులు - చేర్పులకు శ్రీకారం చుట్ట గలరని అంటున్నారు. ముఖ్యమంత్రి ఇంట్లో ఇప్పటికే సలహా మండలి కూడా ఏర్పడిందని అంటున్నారు. ముఖ్యమంత్రికి సమకాలికులైన మాజీలు ఈ మండలిలో వున్నారు. మంత్రుల పని సామర్థ్యాన్ని అంచనా వేసే కార్యక్రమాన్ని ఈ సలహా మండలి చేపట్టింది. తాజా సమాచారం ప్రకారం పది పన్నెండుగురు మంత్రుల్ని అసమర్థ, అవినీతి పరులుగా నిర్ధారించినట్లు అభిజ్ఞ వర్గాల కథనం. అయితే ఇంత పెద్ద సంఖ్యలో

**ఆస్తులలెక్కకు ఇంటలిజెన్స్ అధికార్ల నియామకం?**

ఒక్కసారిగా మంత్రుల్ని తొలగిస్తే అసమ్మతి భూతం తలెత్తే ప్రమాదాన్ని కూడా ఈ సలహా మండలి పేర్కొన్నట్లు తెలుస్తోంది. ఏదైతేనేం తీసి వేతల

కొరవ 10 వ పేజీలో

# ఎన్టీఆర్ దూకుడుకు అల్లుళ్లే స్పీడు బ్రేకర్లు

## రాజధాని రాజకీయం

ఇటీవల జరిగిన కొవ్వూరు, కైకలూరు ఉపఎన్నికల్లో తెలుగుదేశం పార్టీ ఘన విజయం సాధించటంతో ఆ పార్టీ అధ్యక్షుడు ఎన్టీ రామారావు మామ జోరు మీద వుండగా డాక్టర్ వెంకటేశ్వర రావు, నారా చంద్రబాబు నాయుడు మాత్రం కిములాడు కుంటున్నారు. వచ్చే ఎన్నికల్లో పార్టీ అధ్యక్షులుగా తమ తమ వర్గీయులకు టిక్కెట్లు ఇప్పించుకునేందుకు ఇరువురు అల్లుళ్లు ఇప్పటి నుంచే జాగ్రత్త పడుతున్నారు. ఇందులో భాగంగా గతంలో తెలుగు దేశం విడిచి వెళ్లిన మాజీలను లాక్కోటానికి అల్లుళ్లు అవస్థ పడుతున్నారు. ఆలేరు ఎమ్మెల్యే నర్సింహులు తెలుగుదేశం పార్టీకి టాటా చెప్పి ఇండిపెండెంట్ ఎమ్మెల్యేగా గెలిచారు. అయితే తర్వాత దేశంలో చేర్తానని ఉత్సాహం చూపినా ఎన్టీఆర్ వద్దన్నారు. రామారావు పెద్దల్లుడు వెంకటేశ్వర రావు తిరిగి జవ్వుడు నర్సింహుల్ని దేశంలో చేర్పించేందుకు రంగం సిద్ధం చేస్తుండగా నల్గొండ జిల్లాకు చెందిన మాజీమంత్రి మాధవ రెడ్డి మాత్రం నర్సింహులు ప్రవేశానికి అడ్డు పడుతున్నారు. ఈ నేపథ్యంలో యాదగిరిలో అంబేద్కర్ విగ్రహావిష్కరణ పెట్టి నర్సింహులు పెద్ద అల్లుడ్ని ఆహ్వానించారు. అయితే ఆ కార్యక్రమానికి వెళ్లొద్దని ఎన్టీఆర్ వారించారు. అయినా అల్లుడు గారు ఆగలేదు. నర్సింహులు ఏర్పాటు చేసిన కార్యక్రమంలో పాల్గొని మామ గిచిన గీతను దాటారు. అల్లుడు గారు కాబట్టి ఆయన మీద క్రమశిక్షణ చర్యలు తీసుకుంటారని ఎవరూ అనుకోవటం లేదు కానీ చిన్నల్లుడు అండ్ కో మాత్రం ఈ విషయంలో ఎన్టీఆర్ పై వత్తిడి తెస్తున్నారు. ఉపఎన్నికల ఫలితాలతో ఊగి పోతున్న ఎన్టీఆర్‌కు అల్లుళ్ల పోరు స్పీడ్ బ్రేకర్‌లా అడ్డు వస్తోంది.

* * *

రాష్ట్ర మంత్రి వర్గంలో తమ వర్గీయులకు స్థానం దొరికే వరకు ముఖ్యమంత్రితో మంచిగా వుంటూనే ప్రత్యర్థుల పై దాడికి పూనుకోవాలని డాక్టర్ వై.ఎస్. రాజశేఖర రెడ్డి నిర్ణయించినారు. ఇటీవల కడపలోని తన క్యాంపు ఆఫీసు పైన పోలీసులు సోదా చేసిన నేపథ్యంలో వై.ఎస్. తీసుకున్న ఈ తాజా నిర్ణయం ముఖ్యమంత్రికి ఇబ్బందిగా తయారైంది. ముఖ్యమంత్రి కోట్ల విజయభాస్కర రెడ్డి సచ్ఛీలుడు, మంచి వాడంటూనే ఆయన మంత్రులు దివాకర్ రెడ్డి మైసూరా రెడ్డి అవినీతి పరులు అయోగ్యులంటూ వై.ఎస్. వర్గీయులు బహిరంగ ప్రకటనలు చేస్తున్నారు. నిజాయితీ పరుడు, నిప్పు లాంటి వాడైన ముఖ్యమంత్రి తన క్యాబినెట్‌లో దివాకర్, మైసూరా వంటి అవినీతి పరుల్ని కొనసాగించడం మంచిది కాదని వెంటనే వారిని మంత్రి వర్గం నుంచి తొలగించాలని వై.ఎస్. వర్గీయులు డిమాండ్ చేస్తున్నారు. వై.ఎస్. వర్గంలో హార్డ్ కోర్ ఎమ్మెల్యేలో ఒకరైన వరదరాజులు రెడ్డి ద్వారా వై.ఎస్. చేయించిన ప్రకటన తీవ్రత ముఖ్యమంత్రిని కలవర పెట్టినట్లు భావిస్తున్నారు. అవినీతిని అంతం చేస్తానని ముఖ్యమంత్రి వివిధ సందర్భాల్లో బల్లగుద్ది మరీ చెబుతున్నారు. తనలో బలహీనతను వై.ఎస్. వర్గీయులు రాజకీయంగా వాడుకోవటం కోట్లను ఇరకాటంలో పెట్టింది. కాంగ్రెస్ ఎమ్మెల్యే స్వయంగా కాంగ్రెస్ మంత్రుల్ని విమర్శించడం అంటే చిన్న విషయం కాదు. తమ ప్రత్యర్థులైన దివాకర్, మైసూరా వంటి శీలం లేని వారిని వదిలించు కొని ముఖ్యమంత్రి అగ్ని పునీతులు కావాలని వై.ఎస్. వర్గీయులు అంటున్నారు. తమ పై లేని పోని నిందలు మోపుతూ రాజకీయంగా అప్రతిష్ట పాల్జేస్తున్న వారిపై చర్య తీసుకోవాలని మైసూరా, దివాకర్ రెడ్డి ముఖ్యమంత్రిని శరణు వేడారు. అయితే, ముఖ్యమంత్రి మాత్రం ఈ విషయంలో నెమ్మదిగా ఆచి తూచి వ్యవహరించాలను కున్నట్లుంది.

మీరు తొందర పడకండి. అన్నీ అవే సర్దుకుంటాయని ముఖ్యమంత్రి వారికి నచ్చ చెప్పారని అంటున్నారు. కర్నూలు లోక్ సభ సభకు త్వరలో జరుగనున్న ఉపఎన్నికలలో ముఖ్యమంత్రి కుమారుడు కోట్ల సూర్యప్రకాష్ రెడ్డి పోటీ చేస్తారంటున్న నేపథ్యంలో వై.ఎస్. వర్గంతో తలపడడానికి కోట్ల వారు సిద్ధంగా లేరని అంటున్నారు.

మంత్రుల్ని తొలగించాలన్న డిమాండ్‌కు తలవంచక పోయినా వై.ఎస్.ను తృప్తి పరచటానికి దివాకర్, మైసూరాల శాఖల్ని మార్చ వచ్చని అభిజ్ఞ వర్గాల నేపథ్యం.

## కోట్లకు సన్‌స్ట్రోక్

రాష్ట్ర ముఖ్యమంత్రి కోట్ల విజయభాస్కర రెడ్డికి 'సన్‌స్ట్రోక్' తప్పేట్లు లేదు. ముఖ్యమంత్రి పుత్ర రత్నం కోట్ల సూర్యప్రకాష్ రెడ్డి ప్రభుత్వ వ్యవహారాల్లో "చేయి" చేస్తున్నాడన్న విమర్శ వినిపిస్తోంది. అంతే కాకుండా సొంత జిల్లా కర్నూలులో ఎక్కడ రిబ్బన్ కత్తిరించాలన్నా, పునాది వేయాలన్నా సూర్యప్రకాష్ రెడ్డిని పిలుస్తున్నారట. కర్నూలు జిల్లాకు సంబంధించి ఎవరు వెళ్లినా ప్రకాష్ బాబును చూడమని ముఖ్యమంత్రి అంటున్నారట. దానికి తగినట్లుగానే కర్నూలు జిల్లా అధికార యంత్రాంగం, రాజకీయ యంత్రాంగం అంతటా "ప్రకాష్ బాబు" కను సన్నల్లో మసలుతోంది. ముఖ్యమంత్రి కుమార రత్నం రాజ్యాంగేతర శక్తిగా వ్యవహరిస్తున్నాడని ఇప్పటికే ప్రతిపక్షాలన్నీ గగ్గోలు పెడుతున్నాయి. త్వరలో జరుగనున్న కర్నూలు లోక్ సభ

శేషం 10 వ పేజీలో

# జమీన్‌రైతు

## కనువిప్పు కావాలి!

కొవ్వూరు, కైకలూరు ఉప ఎన్నికల ఘోర పరాజయం కాంగ్రెస్ పార్టీకి మర్చిపోలేని గుణపాఠం. ఏడేళ్ల తెలుగు దేశం పాలనతో వెగటు పుట్టి, అరణ్యవాస శిక్షనుంచి కాంగ్రెస్‌కు విముక్తి కల్పించిన తెలుగు ప్రజలు తాము చక్కతోకకు వంకర తీయడానికి ప్రయత్నించామని పశ్చాత్తాప పడేటట్లు ప్రవర్తిస్తున్నారు కాంగ్రెస్ నాయకులు, వారి ప్రభుత్వాలు కూడా! మూడున్నరేళ్ల క్రితం ఏలినవాటి శనిగా భావించిన ఎన్టీఆర్ దురదృష్టకర పరిపాలననే మళ్లీ తెచ్చినెత్తిన పెట్టుకోవాలని ప్రజలు భావించే విధిలేని పరిస్థితిని కల్పించారు వారు. మూడు వందలమైళ్ల దూరంలో వున్న రెండు జిల్లాల ఓటర్లు ఒకే తీరులో ఆలోచించి, ఒకే రీతిలో ఓటు వేయడం ఈ ధోరణిని ప్రతిబింబిస్తున్నది. సాధారణ ఎన్నికలకు పట్టుమని పదిహేనిరవై నెలలు కూడా లేని ఈ సమయంలో జరిగిన ఉప ఎన్నికలు తెలుగు దేశం పరం కావడం రాష్ట్ర భవిష్యత్ రాజకీయానికి ఒక సూచనగా భావించవచ్చు.

ఇంత స్వల్పకాలంలో రాష్ట్ర ప్రజలకు కాంగ్రెసంటేఎందుకింత ఏవగింపు ఏర్పడింది? ముఖ్యమంత్రిగారు వ్యాఖ్యానించినట్లు రైతాంగంలోని కాంగ్రెస్ వ్యతిరేకత ఈ ఓటమికి ఒక కారణం కావచ్చు; అయితే అదొక్కటే కారణం కాదు. రైతులలోకంటే వర్గతారతమ్యం లేకుండా మహిళలలో కాంగ్రెస్ పట్ల వైముఖ్యం కన్పించింది; ఎన్టీఆర్‌ను ద్వేషించిన వెనుకబడిన తరగతులలోనూ ఇది కన్పించింది. మూడున్నరేళ్ల కాంగ్రెస్ పరిపాలనలో పెచ్చరిల్లిన అవినీతి, అసమ్మతి, మంత్రుల అసమర్థత, ప్రభుత్వం వుండేది తమ స్వంత బాగుకే నన్న ధోరణి, ప్రతి వస్తువుపైనా పెరిగిన ధరలు, ఎరువుల ధరలు పెంచి ధాన్యం ధరలు తగ్గించే తప్పుడు విధానాలు, సబ్సిడీ బియ్యం పథకం కోత వంటి వన్నీ ఈ వ్యతిరేక ప్రభంజనానికి తమ వంతు తోడ్పాటు నందించాయి.

ఈ వాస్తవాన్ని గమనించి కనీసం రానున్న ఏడాదిన్నర కాలంలోనైనా తమ విధానాలు సరిదిద్దుకోగల్గితే కాంగ్రెస్‌కు ఈ గడ్డమీద మూకలు మిగులుతాయి; లేకుంటే ఈ రాష్ట్రానికి మళ్లీ తెలుగు దేశం దౌర్భాగ్య పరిపాలన దాపురిస్తుంది. కాంగ్రెస్ నేతలకు ఈ ఓటమి కనువిప్పు రావాలి!

## పాకిస్తాన్ తీర్పు

పాకిస్తాన్ ప్రభుత్వము, పార్లమెంట్‌ల రద్దు రాజ్యాంగ విరుద్ధమని ఖరాఖండిగా తేల్చిచెప్పడంతో పాటు, ఆ రెండింటినీ పునరుద్ధరించాలని పాకిస్తాన్ సుప్రీంకోర్టు ఇచ్చిన తీర్పు సంచలనాత్మకమైనది. ప్రధాని నవాజ్ షరీఫ్ పై కోపంతో, వ్యక్తిగత ద్వేషంతో ప్రభుత్వాన్ని బర్తరఫ్ చేసి పారేసిన అధ్యక్షుడు ఇషాక్‌ఖాన్‌కు కోర్టు పెద్ద మొట్టికాయివేసింది.

పాకిస్తాన్‌కు, ఆ దేశాధ్యక్షుడికి పార్లమెంట్‌ను రద్దుచేయడం, ప్రభుత్వాన్ని పీకి పారేయడం కొత్తకాదు; వీటిని కోర్టు అభ్యంతర పెట్టడమే ఆశ్చర్యకరం. దేశాధినేతల కనుసన్నలలో, సైన్యం తుపాకుల అడుగుజాడలలోమెలగడం తప్ప, పాకిస్తాన్ సుప్రీంకోర్టుకు ఇట్లా స్వతంత్రించి నిర్ణయాలు తీసుకొనే సాహసం ఎప్పుడూ లేదు. అందువల్లే ప్రపంచం యావత్తు ఆ తీర్పువిని నివ్వెర పోయింది. ఆ దేశంలో ప్రజాస్వామ్యం ఇంకా బ్రతికి వున్నందుకు సంతసపడింది.

అధ్యక్షుడు ఇషాక్ ఖాన్ పరమస్వార్థపరుడు. ఆయన అల్లుడు పరమ కిరాతకుడు, బహిరంగంగా మానభంగాలు చేసే నీచుడు. మాజీ ప్రధాని బెనజీర్ భుట్టో స్నేహితురాలు కూడా ఆ నరపశువు కామాంధతతకు బలైపోయినా, దేశాధ్యక్ష పదవిలోవుండి అల్లుడిని రక్షించిన పెద్దమనిషి ఇషాక్‌ఖాన్. అతడికి సైన్యం మద్దతు వుంది. లోపాయికారిగా బెనజీర్ భుట్టో సహకారం వుంది. ఆ రెండింటినీ ఆసరాగా చూసుకొని, షరీఫ్‌ను ఇంటికి పంపాడాయన.

అసలే పాకిస్తాన్‌లో ప్రజాస్వామ్యం పరిమితం. ఎప్పుడు సందుదొరికితే అప్పుడు అధికారం చేజిక్కించుకోవడానికి సైన్యం ఎదురు చూస్తుంటుంది. సైన్యం పెత్తనంలోకి రావడమంటే ఆ దేశ ప్రజలకు నియంతృత్వపు చెర దాపురించడమే. పొరుగున వున్న భారత దేశానికి అది క్షేమకరం కాదు. పాకిస్తాన్ నేతల అణువణువులోనూ జీర్ణించుకొని పోయిన భారతద్వేషం మన సరిహద్దులలో అశాంతిని, అరాజకాన్ని ప్రేరేపిస్తుంది! సైన్యంలో వుండేవారికి యుద్ధమంటే సరదా; ప్రజాస్వామ్య ప్రభుత్వం వున్నప్పుడే కాశ్మీర్, పంజాబ్ తీవ్రవాదులను రెచ్చగొట్టి మనపైకి పురికొల్పేవారు, సైన్యం రాజ్యానికి వస్తే ఏమి చేస్తారో ఊహించుకోవచ్చు.

స్వతంత్రంగా, నిర్భయంగా, నిజాయితీగా దేశాధ్యక్షుడి నిర్ణయాన్ని రద్దుచేస్తూ తీర్పుచెప్పిన పాకిస్తాన్ సుప్రీంకోర్టును అభినందించాలి! ఆ దేశనేతలు ఆ తీర్పును గౌరవించి నవాజ్ షరీఫ్ ప్రభుత్వాన్ని అప్పుజెప్పేందుకు ప్రపంచమంతా ఒత్తిడి తేవలసిన అవసరం వుంది.

# జమీన్‌రైతు

28.5.1943

4 పేజీలు, అణా:

## 50 ఏళ్ళ క్రితం ఈ వారం

### నెల్లూరు ముచ్చట్లు

### పెళ్ళిళ్ల పురాణాలు

యుద్ధం పుణ్యమా అంటూ అన్ని వస్తువులకు ధరలు పెరిగినట్లే పెళ్లి కొడుకుల ధర గూడా విపరీతంగా పెరిగింది. చదువుకొన్న వాడు, యువకుడు, కొంచెం యద్రతోలుగా వుండంటే యిక మార్కెటులో ధర విపరీతంగా మోగిపోతున్నది. ఎంత పుచ్చు సరుకు గూడా 20 వేలకు తక్కువ ధర బడదు.

* * *

గుర్రాల కుసుళ్లు, లక్షణాలు చూచి కొంటున్నారు. బర్రెలను ఆన్నేము సాంప్రదాయము విచారించి కొంటున్నారు. చివరకు యెద్దును గూడా పొరకుసుడి, సుందపు చర్మము గాకుండా కొంటున్నారు. కాని మానవులనే మనము, నవనాగరికపు బురద బూసుకున్న మనము. వధువు - వరాన్వేషణలో యేశాస్త్ర, ఆచారాలను గమనించ కుండా వివాహాలు చేసి దాని పాప ఫలాలను భుజిస్తున్నాము. ఎక్కడైనా ఒక పిల్ల వుందంటే ఆ కుటుంబం మంచి చెడ్డలు, ఆచార వ్యవహారాలు, సాంప్రదాయ మర్యాదలు, జాతక లక్షణాలు, యీడు జోడులు, ఇవేమీ చూడకుండానే "ఎన్ని పెడిస్తారో కట్నం" అనడం, బేరం కుదిరిందంటే తక్షణమే ముహూర్త నిర్ణయం, తబ్బు దట్టుకోవడం. యిది చివరకు తేలిన హిందూ వివాహ సాంప్రదాయ మర్యాద.

క. రత్నములకు, యిల నత్తులు
రత్నములకు, మరి తురం
గత్నములకు స్త్రీ
రత్నములకు, లక్షణములె మత్సంబు
జాత వలయును సనకండు మనుషుల్

* * *

వివాహాదుల్లో యీడుల నేపద్ధతి అనాదిగా ఆచారంలో వుంది. దీనివల్ల వెయ్యి మంది తలా ఒక రూపాయి యీడు క్రింద యిస్తే వివాహాది ఖర్చులకు అప్పుసప్పు చేయకుండా వెళ్లి పోతుంది. భాగ్యవంతుల సంగతెట్లున్నా పేదలకు యిది ఎంతో పరస్పర సహకారిగా ఉంటుంది. కావున యీ పద్ధతిని ఆసిమోషకుందురు గాక.

### అవీ - ఇవీ

యస్.యస్. కృష్ణమూర్తి గారి 'రుద్రవీణ' నాటకాన్ని ఆంధ్రసభవారు జాట్లలో ప్రదర్శిస్తారని వార్త.

* * *

కొత్త పోలీసు సూపరెంటు దివాన రాజయ్యంగార్ 22 తేది ఛార్జి తీసుకున్నారు. పాత సూపరెంటు ప్రజ్ఞాధిక్యాలను అభినందించ నెందుకు క్షమించండి.

\- విమర్శకుడు

### గండిగుంటలో, 'జమీన్‌రైతు' చదవరుల సమావేశం

"కృష్ణా జిల్లా గండిగుంట గ్రామంలో జమీన్‌రైతు, చదవరుల సమావేశం వచ్చే ఆదివారం నుంచి, ప్రతి ఆదివారం జరుగును. జూన్ 1 తేదీన గండిగుంట గ్రామ జాతీయ యువ జన సంఘం ప్రారంభోత్సవం గూడా జరుగును" అని మన్నె శివరావు గారు వ్రాయుచున్నారు.

### కాంచనమాల

ఈ మధ్యంతా కనబడని కాంచనమాల - జెమినీ వారి బాలనాగమ్మగా జన్మించి నెల్లూరు వినాయక హాల్లో మాయలమరాఠి పెట్టె కష్టాలను అనుభవిస్తూ వున్నది.

# జనవాణి

## ప్రజా ప్రతినిధులు నీతిగా వుంటేనే ప్రభుత్వాధికార్లు దారికి వచ్చేది!

మే 14 తేది పత్రికలోని సంపాదకీయం అంశాలు "రాజీనామా చేయాలి, తలతిక్క శేషన్" పత్రికకే తలమానికం. కంచే చేను మేసినట్లుగా పాలకవర్గం ఈ విధంగా ప్రవర్తించ బట్టే ప్రభుత్వ యంత్రాగంలో అవినీతి రామస్వాములు, తలతిక్క శేషన్‌లు బలపడి పోతారనడంలో సందేహం లేదు.

ప్రభుత్వ పాలనా వ్యవస్థలో పాలకులు జరిపే అధికార దుర్వినియోగం బయటకు పొక్క కుండా మాచు కొగలగుతున్నారు. అదే ప్రజా ప్రతినిధి చేసే చిన్న తప్పయినా పెద్దదిగా చిత్రీకరించడంలో వెనుకాడరు. ఏది ఏమైనా ప్రజల కష్టార్జితం మీద పబ్బం గడిపే అధికార వర్గం నీతి నియమాలకు లోబడి నడుచు కోవాలంటే ప్రజా ప్రతినిధులు నీతి పరులుగా వుండాలి.

కొచ్చిన్ - ఎన్. రామచంద్రా రెడ్డి

### ఎన్టీఆర్ గొప్ప నటుడే!

ఎన్టీ రామారావు ఈనాటికీ కూడా గొప్ప నటుడే. అందులో ఏ మాత్రం సందేహం లేదు. 'నర్తనశాల' సినిమాలో ఆయన చేసిన బృహన్నల పాత్ర మహాద్భుతంగా చేసారు. బహుశా అంత గొప్పగా ఎవ్వరూ చేయలేరేమో! ముఖ్యమంత్రి అయ్యాక కూడా ఆయన అదే బాటన కొనసాగి విఫల మయ్యారని చెప్పవచ్చు. రాజకీయ రొచ్చులోకి రాక [illegible] ఎం.ఎస్. సుబ్బలక్ష్మి, బాల మురళీకృష్ణ [illegible] ఖ్యాతి గడించారు పాపం [illegible] ఈ [illegible] పొసుకొని వరపవతార మెత్త వలసి వచ్చింది.

గూడూరు - ఆవుల కొండయ్య

### చిటీలు - మోసాలు

ఇటీవల బొనలో, చిటీల వ్యాపారం దిన, దిన ప్రవర్ధమాన మవుతున్నది. చిటీలు పాడుకొన్న వ్యక్తులు పరారై పోతుంటే, నడిపే వారు కూడా లక్షలు మూట కట్టుకొని కొన్ని సార్లు అడ్రస్ లేకుండా వెళ్లి పోతున్నారు. దీనివల్ల వేలాది మంది ప్రజలు మోసగింపబడుతున్నారు. చిటీలు నిర్వహించాలంటే దానికి కొన్ని నియమ నిబంధనలు, రిజిస్ట్రేషన్ ఇత్యాది వ్యవహారాలు వుండాలి; కాని వాటిని తుంగలో తొక్కి వేస్తున్నారు. ఇటీవల నెల్లూరులో ఒక వ్యక్తి ఆత్మహత్య కూడా చేసుకొన్నారు. ఈ చిటీల వ్యవహారాన్ని ఎవరూ సంస్కరిస్తారో అర్థం కావడం లేదు.

నెల్లూరు - ఎస్.వి.ఎస్. కోటేశ్వర రావు

### మహదానందం

జమీన్‌రైతు గతవారం సంచికలో కంచికామకోటి పీఠాధిపతి శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వామి వారి పవిత్ర చరిత్ర, చిత్రంతో సహా అందించి నందుకు మహదానందమైంది. అనుక్షణం, అశాంతి, అరాచకత్వం హింస, యూపత్ ప్రపంచాన్ని సర్వనాశనం చేయు చున్న ఈ తరుణంలో ఆధ్యాత్మికతయే జాతికి శ్రీరామరక్ష. అటువంటి ప్రత్యక్ష దైవం [illegible]

తరువ 10 వ పేజీలో

కలెక్టర్ హెచ్చరిక: తాటాకు చప్పుళ్లకు కుందేళ్లు బెదుర్తాయా?

# పిల్లలు ఫెయిలైతే వార్డన్ల ఉద్యోగాలు గోవింద!

సాంఘిక సంక్షేమ శాఖ ఆధ్వర్యంలో జిల్లాలో నడుస్తున్న పలు హాస్టళ్ల పదవ తరగతి ఉత్తీర్ణతా శాతం జిల్లా కలెక్టర్‌ను నొప్పించి నట్లుంది. అందుకే 22 తేది కస్తూర్బా కళాక్షేత్రంలో జరిగిన వార్డన్, మ్యాట్రన్ల వర్క్ షాపులో ఉత్తీర్ణతా శాతం తగ్గిన హాస్టళ్ల వార్డన్, మ్యాట్రన్‌లను డిస్మిస్ చేస్తానని హెచ్చరించారు. ఈ మేరకు ప్రభుత్వ ఉత్తర్వులు కూడా వున్నాయన్నారు. హాస్టళ్లలోని సమస్యల పరిష్కారానికి సత్వర చర్యలు తీసుకోవడంతో పాటు విద్యార్థిని. విద్యార్థులకు తగిన సూచనలను ఇచ్చేందుకు ట్యూటర్స్‌ను నియమిస్తా మన్నారు. అయినా కలెక్టర్ గారి కంఠశోష గాని చర్మం మందంగా వుండే వార్డన్లు, మెట్రన్లలకు ఈ మాటలు శ్లేషం తెప్పిస్తాయా?

## కళాంజలి పోటీల్లో విజేతలు

కళాంజలి సాంస్కృతిక సంస్థ నిర్వహించిన రాష్ట్ర స్థాయి సంగీత, నృత్య నాటిక పోటీలు ఆదివారం

## సింహపురి

ముగిసాయి. బహుమతి ప్రదానోత్సవ సభలో ప్రముఖ సినీ మాటల రచయిత లవకల్లి భరణి, దర్శకులు జనార్ధన మహర్షి, నటుడు మల్లికార్జున రావు పాల్గొన్నారు. నాటిక పోటీల్లో ఒంగోలు అభ్యుదయ కళా సమితి ప్రదర్శించిన పునరపి. చిలకలూరి పేట వారి మృగమైదానం ప్రథమ, ద్వితీయ బహుమతులు పొందాయి. ఉత్తమ రచయితగా వీరపల్లి వీణావాణి (మృగమైదానం) ఉత్తమ దర్శకుడుగా జె.ఎస్. రాజశేఖర్ (పునరపి) ఉత్తమ నటీనటులుగా బి.వి. చంద్రశేఖర్, బి. వినోద్, రమాదేవి, ఎన్. పెద్దబ్బ ఎంపికయ్యారు. ఎ.వి. శేఖరాచారికి ప్రత్యేక నటుడి బహుమతి నిచ్చారు.

## అశ్లీలత, హింసకు వ్యతిరేకతా సదస్సు

నైతిక విలువలను పతనం చేస్తున్న నేటి పత్రికలు, సినిమాలలో పెచ్చు పెరిగిన హింస, అశ్లీలతలను వ్యతిరేకించాలనే భావన ప్రజల్లో కలుగజేయాలనే సదుద్దేశంతో 'స్పందన' సాహితీ సంస్థ 23 తేది దొర్త పద్మావతమ్మ మహిళా

తరువ 13 వ పేజిలో

# సణుగుడు

## వృద్ధ సింహం గర్జనలు వూరకే పోతాయా?

వృద్ధ సింహం గర్జించింది; అనేం సంజీవ రెడ్డి గారు అనేక పరిపోయారు. ఎంత కాలమై పోయిందో సంజీవ రెడ్డి గారు తాను ఒకప్పుడు పులిలాగా బ్రతికానని మర్చిపోయి! పరిస్థితుల కనుగుణంగా అణచి పెట్టుకున్నా, స్వభావ సిద్ధ లక్షణాలు, గుణాలు ఎప్పుడో ఒకప్పుడు బయట పడక తప్పవు. తనను తాను జనార్దన రెడ్డి పోస్ట్‌మ్యాన్‌గా అభివర్ణించుకొని, వచ్చే ప్రోగ్రాం, వెళ్లే ప్రోగ్రాం చెప్పడం వరకు పరిమితమై పోయి, జి.కాం. అధ్యక్షతను అలంకార ప్రాయంగా భావించుకుంటుండిన సంజీవ రెడ్డి గారు ఒక్కసారిగా రెచ్చి పోవడానికి కారణమేమిటి? సింహం ముసలిదై పోయినా జీర్ణ తృణం మేయదు– ఎక్కడో ఎవడో కి అన్నా ఇక్కడాయన గొంతు విప్పుతని అనుకోలేము; ఆ భావాలు తనలోనే కల్గి వుండాలి; ఆ ఆవేశం తనకు తాను నిర్ణయించుకున్న పరిధులను ఛేదించి వుండాలి; ఆ వాక్ప్రవాహం ఎవరి ప్రమేయం లేకుండానే వచ్చి వుండాలి; ఆ దూకుడు వెనుక ఏదో తెగింపు వుండి వుండాలి; ఆ మాటల తీరు ఏదో తీవ్రమైన పథక రచనలో భాగమై

**దేవేంద్ర**

వుండాలి. ఏదీ లేకుండా వులుసు పోకకు జిల్లా రాజకీయ సరస్సులో రాయి విసిరి వినోదం చూసే ఆకతాయి కాదు అనం సంజీవ రెడ్డి గారు. ఆ అవసరమూ ఆయనకు లేదు. ఆఫ్ ది రికార్డుగా మాట్లాడితే సెన్సేషన్ సృష్టించడం కోసం విలేఖరి చేసిన దుస్సాహసం అసలే కాదు. పిలువగా వచ్చి, చెప్పింది వ్రాసుకొని, ఏ అంశం ప్రాధాన్యత నివ్వ దగిందో సూచన లందుకొని

తరువ 12 వ పేజిలో

కాలేజీ చదువులు చదవక పోయినా స్వయంకృషితో బహుభాషా పాండిత్యం సముపార్జించిన అసాధారణ ప్రజ్ఞాశీలి

# మాలతీ చందూర్

వేలాది తెలుగిళ్లలో అభిమాన కోటి వున్న ఒకే ఒక తెలుగు రచయిత్రి. వారందరి చేత అక్కా అనిపించుకో గల్గిన అదృష్టశీలి.

## రామానాయుడు అవార్డు గ్రహీత పరిచయం

మాలతీ చందూర్ పేరు వినని మధ్యతరగతి తెలుగిల్లు వుందంటే, వుంటుందంటే నమ్మలేము. ఇప్పటి పిల్లకారుకు అంతగా పరిచయం లేకపోయినా, పది, పదిహేనేళ్ల క్రితం వరకు ప్రతి చదువుకున్న తెలుగు ఆడపడచుకూ మాలతీ చందూర్ సుపరిచితురాలు. కేవలం ఒక రచయితగా కాక, ఆమెను తమ సోదరిగా, మార్గదర్శకురాలిగా, మనసు విప్పి మనోభావాలు చెప్పుకోగల్గిన ఆత్మీయురాలిగా భావించే వారెందరో వుండేవారు. హోం లైబ్రరీలో మాలతీ చందూర్ నవలలకు ఫస్టో ప్రాధాన్యత లభించేది.

మాలతీ చందూర్ గారిది విలక్షణ జీవన శైలి! డాక్టర్ సి.నారాయణరెడ్డి వంటి ఉద్దండుడు; భాషను, సాహిత్యాన్ని ఔపోసన పట్టిన సాహితీ రుషితుల్యుడితో సరిసమానంగా జాతీయ స్థాయిలో భారతీయ భాషా పరిషత్తు పురస్కారం అందుకున్న ఆమె హైస్కూలు చదువు దాటని నగటు తెలుగు ఆడపడచు అంటే నమ్మలేము. ఆమె ఎప్పుడూ కాలేజీల గడప తొక్కలేదు. పెళ్లి కానంతవరకు 'మాలతి' మామూలు తెలుగు మహిళే! ఎన్ఆర్ చందూర్‌తో జీవిత భాగస్వామ్యం స్వీకరించి, గృహిణిగా మారిన తర్వాతే ఆమెలోని అంతర్గత సాహితీ కుసుమాలు, అంతర్లీనంగా వుండిపోయిన రచనా, పాత్రికేయ ప్రావీణ్యాలు వికసించడం మొదలు పెట్టాయి. చందూర్ స్వతహాగా సాహితీ కారుడు; 'జగతి' పత్రికా సంపాదకుడు. తన సతీమణిలోని సహజ నైపుణ్యాన్ని గుర్తించి, ప్రోత్సహించా రాయన. ఆ మాలతీ లత వికాసానికి 'పందిరి' మాదిరి వుపకరించారు. ఆసరా దొరకగానే మాలతీ తీగవలె అల్లుకపోయి, తనసాహితీ సౌరభాన్ని ఆంధ్రదేశ మంతటా వ్యాపింపజేశారామె.

మాలతీ చందూర్‌కు పేరు తెచ్చింది, ప్రాచుర్యం కల్పించింది, ప్రమదాలోకంలో గుర్తింపు, గౌరవం కల్పించింది - 'ఆంధ్రప్రభ' లోని ప్రమదావనం 'శీర్షిక'. '1952 ఆగస్టు 15 తేది ప్రారంభ సంచికతో ప్రారంభమైన ఆ శీర్షిక ఈ నలభై ఒక్క సంవత్సరాలూ నిర్విఘ్నంగా, నిరంతరాయంగా కొనసాగుతూనే వుంది. ఒక్క వారం బ్రేక్ లేదు. మహిళల వ్యక్తిత్వ వికాసాన్ని ప్రబోధించే రచనల నుంచి, వంటలు పిండివంటల వరకు; సంసార జీవనంలోని సున్నితమైన సమస్యల పరిష్కారానికి సూచనల నుంచి, అందం పెంచుకునేందుకు సలహాలవరకు ఆ శీర్షికలో ఆమె కొన్నివేల వ్యాసాలు వ్రాశారు; లక్షలాది తెలుగు మహిళలకు ఆరాధ్యనీయురాలుగా ఎదిగారు. అదే పత్రికలో "జవాబులు" శీర్షికన పిల్లల నుంచి పండు ముదుసలుల వరకు ఎందరికో స్వాంతన వచనాలు పలుకుతున్నారు. ఎంతో ఆప్తులైన వారితో చెప్పుకొని ఊరట పొందినట్లు తమ స్వంత కుటుంబ సమస్యలు. సంసారంలోని చిక్కులను కూడా విడమరచి చెప్తూ "అక్కా" అని సంబోధిస్తూ జాబులు వ్రాసే వారున్నారు. మరే తెలుగు రచయిత.

తరువ 12 వ పేజిలో

# చేజారిన కోవూరు కోసం చింతపడేకంటే చేజారనున్న వాటిని భద్రపర్చుకోవాలి!

కోవూరు ఉప ఎన్నికలోకాంగ్రెస్ అభ్యర్థి ఘోర పరాజయం ప్రతి కాంగ్రెస్ వాదినీ కలవర పరుస్తున్నది. ప్రచారం తొలిదశ నుంచి పెళ్లకూరు రామచంద్రారెడ్డి గారు గెలుస్తారనే నమ్మకం మా కైతే లేదు. ఓటర్ల తీరు తొలి మూడు నాలుగు రోజుల్లోనే స్పష్టంగా వ్యక్తమైంది. అయితే ఆ ఓటమి ఇంత అవమాన కరంగా, సిగ్గు పడాల్సిన తీరులో వుంటుందని

**పార్టీని ప్రక్కన బెట్టి వ్యక్తిగత గ్లామర్ ముందుకు నెట్టడం ఓటర్లిష్టపడలేదు; వెన్నుపోట్లు అనాసక్తత మెజారిటీ పెంచాయి!**

మేమేకాదు, ఎవరూ ఊహించలేరు. తెలుగు దేశం అభ్యర్థి మెజారిటీ-(23848) ఎంతో ఇంచుమించు కాంగ్రెస్‌కు వచ్చిన ఓట్లు(25326) అంతే కావడం పార్టీకి, అభ్యర్థికి కూడా ఎంత అవమానం?

రాజకీయ పరిశీలకులు, ఎన్నికల గణిత శాస్త్రనిపుణుల అంచనాలన్నింటినీ తారుమారుచేసింది ఈ ఉప ఎన్నిక. 1985,1989 ఎన్నికలలో కాంగ్రెస్ ఓటు బ్యాంకుగా స్థిరీకరింపబడిన 29 వేల ఓట్లు సైతం రాలిదంటే ఇంక ఏ అంచనాలు పని చేస్తాయి చెప్పండి! సాక్షాత్తు ప్రధానమంత్రి స్వంత అభ్యర్థి అయి వుండి. ముఖ్యమంత్రి ఆశీర్వాదాలు పొంది. మాగుంట సుబ్బరామిరెడ్డి మందుకుండలో మార్పు. ప్రద్యాన్ని ప్రవంచలో పారించి కూడా పెళ్లకూరు తన పట్ల ప్రజలలో ఏర్పడిన వైముఖ్యాన్ని తగ్గించుకోలేక పోయాడంటే కోవూరు నియోజకవర్గంలో ఆయన పట్ల ఎంత నిరసన, వ్యతిరేకత ఏర్పడి వుండివాయో అర్థం చేసుకోవచ్చు. కాంగ్రెస్ పరాభవానికి ప్రధాన కారణం అభ్యర్థిత్వపు బలహీనత అనే నిందను ఈ వయసులో ఎదుర్కోవలసి రావడం పెళ్లకూరు చేసుకొన్న దురదృష్టం. చివరి క్షణంలో అభ్యర్థిగా ఆకాశం నుంచి క్రిందకు దూకి, అందరినీ కష్టపెట్టారాయన.

## ఉపఎన్నిక పోస్టుమార్టం

అభ్యర్థిత్వం సరే - మాగుంట గ్లామర్ కూడా ఎందుకు విఫలమైంది? గ్లామర్ పనిచేసి వుంటే గెలుపు కాకపోయినా కనీసం మెజారిటీ అయినా తగ్గివుండాలి. వ్యక్తిగత ధారిస్మాకు రాజకీయ పరమైన నిర్ణయానికి ముడిపెట్టనంత చైతన్యం కోవూరు ఓటర్లలో వుండడమే దీనికి కారణం కావచ్చు. సుబ్బరామరెడ్డి గారిని వ్యక్తిగా గౌరవించారు, ఆయన వదాన్యతను వాడుకున్నారు, వాగ్దానాలు తీసుకున్నారు, అడిగి మరీ పనులు చేయించుకున్నారు. ఓటు దగ్గర కొచ్చేసరికి సైకిల్ మీద గుద్దేశారు. డబ్బుగాదు ఒక నిర్ణయానికి రావడమంటూ జరిగితే ఉద్యోగాల వంటి ప్రలోభాలకూ జనం లొంగరని అర్థమై పోయింది సుబ్బరామరెడ్డి గారూ ఈ ఉప ఎన్నిక ఫలితం ద్వారా తన రాజకీయ శైలిపై ఆత్మవిమర్శ చేసుకోవాలి. ప్రజలకు సన్నిహితం కావడానికి డబ్బు అవసరం లేక పోవడం కాదు- అప్పుడప్పుడూ అదే పెద్ద అవరోధంగా కూడా తయారౌతుంది! సేవ చేయదలుచుకుంటే స్వంత డబ్బుతో ప్రజలను మచ్చిక చేసుకోవడం కాదు, ప్రజలకుపయోగపడే పనులు, ప్రాజెక్టులు, ఇతర పథకాలు ప్రభుత్వంతో పోరాడి సాధిస్తే ప్రజలు హర్షిస్తారు. స్వర్గీయ ఏసి పేరు ఈనాటికీ సజీవంగా వుందంటే ఆయన ఏ డబ్బు ఖర్చు పెట్టి సంపాదించిన దది? ఈరోజు నల్లపరెడ్డి శ్రీనివాసులు రెడ్డి సానుభూతి పవనాలు ప్రభంజనం వలె వీచాయంటే,

**మహిళా ఓటర్లు అంత కసిగా కాంగ్రెస్‌నెందుకు వ్యతిరేకించారు? సి.పి.ఎం., బి.జె.పి., బ్యాంకుల్లో సైతం రాబరీ జరిగింది!**

శీనయ్య జేబునుంచి పెట్టిన ఖర్చు ఏముంది? తాత్కాలిక ప్రచారాలు, పలుకుబడుల కంటె శాశ్వతోపయోగ కార్యాలకు సుబ్బరామరెడ్డిగారు తన సంపదను, శక్తియుక్తులను వినియోగించ గల్గితే జిల్లాలో ఆయన తిరుగులేని శక్తిగా ఎదుగుతారు; చిరస్మరణీయుడౌతారు. కోవూరులో వ్యక్తమైన అభిప్రాయమూ అదే! పరిణతి

కొరవ 8 వ పేజీలో

మే 19 తేది ప్రతిష్ఠాకరంగా జరిగిన కోవూరు ఉపఎన్నికలో వివిధ పార్టీల అభ్యర్థులు పొందిన ఓట్ల వివరాలను దిగువ ఇస్తున్నాము. నియోజక వర్గంలోని మొత్తం ఓటర్లు 1,35,304 మంది కాగా 1,01,198 మంది ఓటు హక్కు వినియోగించు కున్నారు. అంటే 74.79 శాతం ఓట్లు పోలయ్యాయన్న మాట. పోటీలో వున్న 13 మంది స్వతంత్రులు తెచ్చుకొన్న 1,797 ఓట్ల కంటె చెల్లని ఓట్లు '1,957' ఎక్కువ కావడం విశేషం.

| రౌండు నెంబరు | తెలుగుదేశం | కాంగ్రెస్ | సి.పి.ఎం. | బి.జె.పి. | స్వతంత్రులు (13 మంది కలసి) | చెల్లనివి | మెజారిటీ |
|---|---|---|---|---|---|---|---|
| 1. | 8,383 | 3,479 | 1,934 | 537 | 289 | 378 | 4,904 |
| 2. | 7,630 | 4,200 | 1,885 | 657 | 268 | 340 | 3,430 |
| 3. | 7,123 | 3,818 | 2,898 | 642 | 237 | 282 | 3,305 |
| 4. | 7,127 | 3,408 | 3,121 | 888 | 218 | 238 | 3,719 |
| 5. | 6,525 | 3,762 | 3,134 | 1,007 | 286 | 286 | 2,763 |
| 6. | 7,039 | 3,449 | 2,865 | 1,113 | 293 | 241 | 3,590 |
| 7. | 5,347 | 3,210 | 1,693 | 570 | 186 | 192 | 2,137 |
| మొత్తం | 49,174 | 25,326 | 17,530 | 5,414 | 1,797 | 1,957 | 23,848 |

# నెల్లూరు ముచ్చట్లు
### విమర్శకుడు

## శంకరాచార్యులు

కంచి కామకోటి పీఠాధిపతి, జగద్గురు శంకరాచార్యులు శ్రీ జయేంద్ర సరస్వతి స్వాముల వారు ఈ రోజు (28 తేది) ఉదయం నెల్లూరు వచ్చారు. శ్రీ రాజరాజేశ్వరి దేవాలయం, రంగనాయకులపేట గుడి సందర్శించారు. శ్రీ పర్వేపల్లి జగన్నాథం ఆతిథ్యంలో సాయంత్రం వరకు గడిపి ఒంగోలు వెళ్లారు.

## జనార్ధన రెడ్డి

మాజీ ముఖ్యమంత్రి, రాష్ట్ర కాంగ్రెస్ నాయకుడు శ్రీ నేదురుమల్లి జనార్ధన రెడ్డి 1 తేది వాకాడు వస్తారు. 2 తేది ఉదయం 6 గంటలకు గూడూరులో ఒక వివాహంలో ప్రజెంట్ వేసుకొని, నెల్లూరు వచ్చి, తిరిగి 10.30 కి తిమ్మాజీ ఇంద్రిగ వెళ్లి స్వర్ణముఖి పై కాజ్‌వే శంకుస్థాపన, 12 గంటలకు చిట్టమూరు వంతెన ప్రారంభోత్సవం కార్యక్రమాలలో పాల్గొంటారు. మధ్యాహ్నం వాకాడు; సాయంత్రం 4.30కి వెంకటగిరిలో ఒటేపల్లి సంతాప సభ. తర్వాత తిరుపతి మీదుగా హైదరాబాదు.



## తొందర పడవద్దు— తప్పు చేయవద్దు

శ్రీ మాగుంట సుబ్బరామరెడ్డి పై శ్రీ ఆనం సంజీవ రెడ్డి చేసిన పత్రికా ప్రకటన అనవసర ఆవేశ కావేషాలకు దారితీస్తున్నది. ఈ రోజు సాయంత్రం ఇందిరా భవన్‌లో జరిగిన ఒటేపల్లి సంతాప సభలో మాగుంట సుబ్బరామ రెడ్డి పేరు ప్రస్తావిస్తూ సంజీవ రెడ్డిని దూషించడం, గడ్డి బొమ్మ తగులబెట్టడం చేశారు. తమనేదో అల్లరి పెట్టడానికి ప్రయత్నం జరుగుతున్నదన్న అనుమానంతో ఆనం కుటుంబమంతా ఏకమై, అన్ని రకాలుగా సిద్ధమై సభకు వెళ్లినట్లున్నారు. తొలి ప్రేరేపణ కాటంరెడ్డి విజయకుమార్ రెడ్డి బృందం నుంచి వచ్చింది. డౌన్‌డౌన్‌లు, జిందాబాద్‌లతో ప్రారంభమైన ఉద్రిక్తత, కుర్చీలు విసురుకునే వరకు పెరిగి, ఘర్షణ ముదిరిపోయింది. తమ కుటుంబాన్ని అవమానిస్తున్నారనే ఉద్రేకంలో ఆనం వారు ఘర్షణలో నేరుగా దిగినట్లున్నారు.

మన జిల్లా రాజకీయాలలో అలవాటు లేని ధోరణి ఇది. రాజకీయ విమర్శలను రోడ్డు పోరాటాలకు తీసుకవెళ్లే సంస్కృతి నెల్లూరులో ఎప్పుడూ లేదు. రెండు వర్గాలూ ఆవేశంలో వున్నాయి. ఇటు సంజీవ రెడ్డికి, అటు మాగుంట సుబ్బరామ రెడ్డి గారికి ఏ మాత్రం గౌరవ ప్రదమైన పరిణామం కాదిది. సుబ్బరామ రెడ్డి గారికి తెలిసి — ఇది జరిగి వుండదు; ఆయన తరఫున కర్ర పట్టుకొని నిలబడ్డామని చెప్తె జేబు నిండా కాసులు పడ్తాయనే దుర్బుద్ధితో ఘర్షణకు ప్రయత్నించి వుట్టున్నారు. ఇది సుబ్బరామ రెడ్డికి ఉపకారం చేయడం కాదు — తెలిసి అపకారం చేయడం; ప్రతిష్టను పాడు చేయడం; ప్రజలలో మలకన చేయడమవుతుంది!

జరిగిందేదో జరిగి పోయింది — ఇరు పక్షాలూ ఇప్పటికైనా తొందర పడకుండా వుండాలి; ప్రశాంత చిత్తంతో ఆలోచించాలి; తప్పు చేయకుండా వుండాలి. పెద్ద మనసుతో, విశాల దృక్పథంతో ఆలోచించి నడుచుకుంటే అందరికీ క్షేమం.

## కోవూరు జోస్యం

ఎన్నికలకు ముందు, పెద పదుగుపాడు జ్యోతిష్కుడు, సిద్ధాంతి శ్రీ చిన్నకోట విజయకుమార్ కోవూరు ఫలితం పై ఒక జోస్యం చెప్పారు. ఓటింగుకు ముందు ఎందుకని అప్పుడు ఇవ్వలేదు. పెళ్లకూరు, ప్రసన్న కుమార్ రెడ్డి ఇద్దరూ తులారాశి వారే అయినా, పెళ్లకూరుకు గురు గ్రహం అనుకూలంగా లేనందువల్ల, ఆర్థిక బలం వున్నప్పటికీ ఓడిపోవడం ఖాయమన్నది ఆయన జోస్యం. అదే నిజమైంది.

## దోపిడీ దొంగల అరెస్టు

నెల్లూరు పోలీసు రెండు ప్రధాన దోపిడీ ముఠాలను అరెస్టు చేయగల్గింది. కోవూరు చక్కెర ఫ్యాక్టరీ దగ్గర 26 తేది రాత్రి ఆర్ నాగేశ్వర రావు అనే హెడ్ కానిస్టేబిల్ ఐదుగురు సభ్యులున్న ఒక ముఠాను తరమి పట్టుకున్నాడు. వీరంతా గుంటూరు, గోదావరి జిల్లాలకు చెందిన

కొరవ 8 వ పేజీలో

## సణుగుడు

(4 పేజీ తరువాయి)

వెళ్లిపట్లున్నారు. ఆ వెలితిని ఏదో పెద్ద రాజకీయ యుద్ధానికి సంకేతం పూరించినట్లు వున్న ఈ ప్రకటన వెల్ల ఆ వెలితిని తెలిపి తప్పనిగా ప్రవర్తించరు.

అసలు వున్నట్లుండి మాగుంట సుబ్బరామిరెడ్డి పై విమర్శ చేయాల్సినంత ఆవేశం సంజీవ రెడ్డి గారికి ఎందుకు వచ్చింది? ఎవరు కల్పించారు? సంజీవ రెడ్డి గారి నోట వెలికి వచ్చి జనార్దన రెడ్డి పలుకులీనన్న అభిప్రాయం వున్నప్పుడు ఆయన అనుమతి లేకుండానంత పెద్ద సంచలనాత్మక ప్రకటన ఎందుకు చేసినట్లు? మాకు తెలిసినంత వరకు ఈ ప్రకటనా పై జనార్దన రెడ్డి రాజముద్రిక వేయలేదు; అందువల్లే ఆయన హైదరాబాదు నుంచి దీని తీవ్రతపై వీళ్ల వద్దకు ప్రత్యేకంగా వివరణ ఇచ్చారు. ప్రకటన వచ్చే సమయంలో కోవూరు బాధితులైన యువ జంట ప్రశ్నినే వుంటుందంటు – తమ కడుపు మంట చల్లార్చుకోవడానికి వారు సంజీవ రెడ్డి గారిని రెచ్చగొట్టి వుంటారా?

అడుసు అరిమి మంగళం పాడ వచినట్లు సంజీవ రెడ్డి గారు మాగుంట సుబ్బరామిరెడ్డి పై విమర్శ చేయడమే ఆశ్చర్యం. సుబ్బరామ రెడ్డి గారు ఒకరి జోలికి వెళ్లే వారు కాదు; పరోక్షంలో కూడా ఎవరినీ విమర్శించరు. స్వభావ రీత్యా భోళా శంకరుడు కావడంతో చుట్టు ముట్టి వుండే వారు చెప్పే మెహర్బానీ మాటలు నిజమని నమ్మి లక్షలు, కోట్లు వృధాగా కాజేసుకోవడం తప్ప తామేగా ఇంకొకరిని నష్టపరచరు. కష్ట పెట్టరు. కోవూరులో ఆయన పడిన కష్టం పగవాడికి కూడా వద్దు. పదిహేను రోజుల పాటు రాత్రనక, పగలనక, ఎండనక, వాననక తిరిగి, కన్పించిన ప్రతి వాడిని బ్రతిమలాడి, కాళ్లావేళ్ల పడి, చేతి చమురు వదిలించుకొని కాంగ్రెస్ అభ్యర్థి కోసం కృషి చేశారు. వ్యక్తిగత ప్రచారంలో కొంచెం అతిగా వెళ్లింది మాత్రం నిజం. చుట్టూ చేరిన వారందరూ మీ గ్లామర్‌తోనే గెలవాలి అని భజన చేయడం తప్పు. అది తప్పు అని చెప్పే వాడే లేడానాడు. ఆ రోజు తినిని కాని, ఇతర కాంగ్రెస్ పెద్దలు కాని చొరవ చేసుకొని నివారించి వుండవచ్చు. ఈ ఎన్నికల 'షో' వల్ల సుబ్బరామిరెడ్డి గారికి ఒరిగిందేమిటి? కోవూరులో కడతానని చెప్పిన ఫ్యాక్టరీ పెట్టుబడికి సరిపడాడబ్బు బూడిదలో పోసిన పన్నీరై పోయింది, అంతే.

ధన బల ప్రదర్శనను ప్రజలు ఏవగించుకున్నా రన్నది నిజం. అది ఈ ఎన్నికల్లోనే కాదు - 1978 ఎన్నికల్లోనే జరిగింది. ఆనాడే గునుపాటి రామచంద్రా రెడ్డి వంటి సంపన్నులను ఓటర్లు నిర్ద్వంద్వంగా తిరస్కరించారు. బోర్లు వేయించినా, రాత్రికి రాత్రి విద్యుత్ స్తంభాలు నాటించినా, పలావు భోజనాలు పెట్టినా సుష్టుగా తిని, ఆ ట్రాక్టరే ఎక్కి, ఆ నాటికి వూరు పేరులేని సివి శేషారెడ్డి, కెవి సుబ్బారెడ్డి, సుందర రామ రెడ్డి వంటి సామాన్యులను గెల్పించారు ఓటర్లు. ఈ సంగతులు ప్రతి కాంగ్రెస్ వాడికి తెలుసు; సుబ్బరామిరెడ్డి గారికి తెలియదు; ఆయనకు తెలియచెప్పి, హెచ్చరిక చేసిన వారూ లేరు.

ఈ పరిస్థితులన్నీ తెలిసిన వాడు కాబట్టే జనార్దన రెడ్డి గారు, సంజీవ రెడ్డి తనకు గురుతుల్యులైనా సుబ్బరామరెడ్డి గారిని సమర్థిస్తూ ప్రత్యేకంగా ప్రెస్‌మీట్ పెట్టి, విమర్శలు ఖండించారు. అది సంజీవ రెడ్డికి కష్టం కలిస్తుందని తెలిసీ మాట్లాడారు



## కోవూరు

(5 పేజీ తరువాయి)

చెందిన ఓటర్లు కాబట్టే వారు మాగుంట ఉదారత్వాన్ని విచ్చలవిడి ఎన్నికల వ్యయాన్ని, హర్షించలేక పోయారు, పార్టీని ప్రక్కన పెట్టిన వ్యక్తిగత ప్రచారాన్ని ఇష్టపడలేక పోయారు! ఒంగోలు విషయంలోనూ సుబ్బరామిరెడ్డిగారు తన స్వంత ఖజానా వ్యయాన్ని అదుపుచేసి ప్రభుత్వం ద్వారానీటి వనరుల కల్పన వంటి పనులపై దృష్టి సారించగల్గితేనే భవిష్యత్తు నికరంగా వుంటుంది.

కాంగ్రెసుకు సంబంధించి ప్రచారం ఎంత జోరుగా సాగిందో ఎన్నికల యంత్రాంగం అంత నిర్వీర్యమై పోయింది. ఓట్లు కలిపి లెక్కబెట్టబోతున్నారన్న వార్త పల్లెలకు చేరడంతోనే మాగుంట మొగమాటాలకు లొంబడి మెహర్బానీగా తిరుగుతుండిన పెద్దమనుషులంతా రిలీఫ్ ఫీలైనారు. పోలింగు రోజు ముఖం తప్పించేశారు. చేసినా, వేయక పోయినా అడిగే వారికి అవకాశం వుండదుకాదా? వెన్నుపోట్లు తప్పలేదు. పలువురు కాంగ్రెస్ పెద్దలు బహిరంగంగానే వ్యతిరేకం చేశారు. వారి వెన్నుపోట్ల వల్ల జయాపజయాల నిర్ణయంలో ప్రభావం ఏమీ లేక పోయినా బుద్ధి మాత్రం బయట పడింది. అంతే!

శీనయ్య సానుభూతి ప్రభావం అంత విస్తృతంగా వుంటుందని తెలుగు దేశం నాయకులూ భావించలేదు. పార్టీ రహితంగా, ఆఖరకు సిపిఎం కుటుంబాలలోని వారితో సహా మహిళలందరూ శ్రీ లక్ష్మమ్మ కంటతడికి మంచు ముద్దలవలె కరిగిపోయారు. ఎందువల్లో మహిళలలో కాంగ్రెస్ పట్ల వ్యతిరేకమైన ద్వేషభావం, పహ్యభావం వ్యక్తమైనాయి. ఏదో తెలియని కసితో ఉదయం ఆరుగంటలకే పోలింగు బూతుల దగ్గర బారులు తీరారు వారు.

కోవూరు చేజారి పోయిందని వగచి ప్రయోజనం లేదు. స్థానికంగా కాంగ్రెస్ వాదులలో, రాష్ట్ర స్థాయిలో కాంగ్రెస్ ప్రభుత్వంలో ఈ వాస్తవాల పట్ల అవగాహన కల్గి, ప్రవర్తనలో మార్పు రాకుంటే రేపు పదకొండు సీట్లను చేజారి పోకుండా కాపాడడం ఎవరి తరమూ కాదు.

## నెల్లూరు ముచ్చట్లు

7 పేజీ తరువాయి

వారు. మన రాష్ట్రంలోనే కాక, ఇతర రాష్ట్రాలలో కూడా దోపిడీలు చేసిన ముఠా ఇది. నెల్లూరులో పలు దొంగతనాలు చేసింది వీరే. మొత్తం 63 దోపిడీలతో తమకు సంబంధం వున్నట్లు వీరు ఒప్పుకున్నారట. చిక్కినప్పుడు వారి దగ్గర 3 లక్షల దోపిడీ సొత్తు వుండింది.

27 తేది రాత్రి ఆదే హెడ్ కానిస్టేబిల్ నెల్లూరు తాటిపర్తి రోడ్డులో మరొక దోపిడీ ముఠాను పట్టుకున్నారు. వీరు రోడ్డు పై బస్సులు నిలిపి దోచుకోవడంలో సిద్ధహస్తులట. వీరి నాయకుడు – నాగారం రామిరెడ్డి నెల్లూరీయుడు. అతడి అనుచరులు నలుగురిలో ఇద్దరు నెల్లూరీయులు. 32 దారి దోపిడీలు చేసినట్లు వీరు ఒప్పుకున్నారట.

ఇంత పెద్ద దోపిడీ ముఠాలను పట్టుకో గల్గిన ఆ హెడ్ కానిస్టేబిల్‌ను, ఇతర పోలీసులను సముచితంగా సత్కరించడం బాగుంటుంది.

## కావలి టౌన్ ఏ శతాబ్దంలో వుందిప్పుడు?

# మురికి నీళ్ళు త్రాగి కలరా వాతపడుతున్నారు!

పట్టణం పెరుగుతున్న కొలది అభివృద్ధి చెందవలసిన అత్యవసర సదుపాయాలు కావలిలో నానాటికి అడుగంటి పోతున్నాయి. దీనివల్ల ప్రజలు పడుతున్న పాట్లు చెప్పనలవి కావటం లేదు. ప్రస్తుతం పట్టణానికి మంచినీరు సరఫరా చేసే బావుల్లో నీరు తగ్గిపోవడం, వచ్చే కొద్దిపాటి నీరు కూడా పరిశుభ్రంగా లేక పోవడం వల్ల మురికి నీళ్లు త్రాగి ప్రజలు కలరా వ్యాధికి గురౌతున్నారు. పట్టణ అవసరాలకు సరిపోయినన్ని నీటి వసతులు కావలిలో లేవు. వీటికి ఎండ తీవ్రత తోడవ్వటంతో పలు ప్రాంతాలలో 20 నిమిషాలకు మించి నీరు రాకపోవడంతో వచ్చిన కొద్దిపాటి నీళ్లకై అతివాళ్లమధ్య యుద్ధాలు, రాద్ధాంతాలు నిత్యకృత్యాలయ్యాయి. కుళాయిలు, బావులే లేని వెంగళరావు నగర్, ఇందిరా కాలనీ, వైకుంఠపురం, కచ్చేరిమిట్టలోని ప్రజలు పడే కష్టాలు పగవాడికి కూడా వద్దంటారు ఈ కాలనీ వాసులు. మొన్నటి వరకు ఎం.పి. మాగుంట సుబ్బరామిరెడ్డి ఏర్పాటుచేసిన ఉచిత మంచినీటి సరఫరా వాహనం ద్వారా కనీసం రెండు బిందెల నీళ్లయినా వీరికి అందేవి. ఈ నీళ్లుతెస్తున్న జీపు ఎండటంతో వీరు పడే పాట్లు వర్ణనాతీతం!

అసలు నీటి సమస్య ఇంత తీవ్రమవడానికి గత కౌన్సిల్ ముందు, వెనుక చూడకుండా కెపాసిటీకి మించిన కనెక్షన్లను ఇవ్వడమే కారణమని సర్వత్రా వినిపిస్తున్నది. నీటి సమస్య ఏర్పడినప్పుడల్లా రాజకీయ నాయకులకు పెదపవని రోడ్డు లోని సమ్మర్ స్టోరేజ్ పథకం గుర్తుకు వస్తుంది. ...

మాటలే కాని చేతలు లేని కావలి నేతల తీరుకు ఈ పథకం ప్రస్తుతం సాక్షిభూతమై నిలిచివుంది. పట్టణంలో గాక కావలి మండలంలోని పలు గ్రామాల్లో ఇదే పరిస్థితి ప్రస్తుతం కొనసాగుతూ వుంది. కంటి తుడుపు చర్యగా ట్రాక్టర్లద్వారా సరఫరా చేస్తున్న నీరు తాత్కాలికంగా ప్రజల దాహార్తి తీరుస్తున్నాయి. శాశ్వత పరిష్కారానికి లక్షలాది రూపాయల నిధులు విడుదల చేసామన్న మాటే గాని పనులు మాత్రం ఎక్కడా కనపడడం లేదన్నది వాస్తవం!

## కృష్ణపట్నం విద్యుత్ కేంద్రానికి టెండర్ పిలిచారు!

జిల్లా పారిశ్రామికాభివృద్ధికి ఊతంగా నిలిచే కృష్ణపట్నం వెయ్యి మెగావాట్ల థర్మల్ విద్యుత్ కేంద్ర నిర్మాణానికి టెండర్లు పిలిచి వారమైనట్లు రాష్ట్ర ఆర్థిక శాఖ మంత్రి శ్రీ కొణిజేటి రోశయ్య చెప్పారు. 15 తేది ముఖ్యమంత్రి శ్రీ విజయభాస్కర రెడ్డితో గోనూరు ఎన్నిక ప్రచారంలో పాల్గొనను వచ్చిన ఆయన సోమశిల అతిథిగృహంలో విలేఖరులతో మాట్లాడారు. తనకు పి.సి.సి. అధ్యక్ష పదవి వరిస్తుందని జరుగుతున్న ప్రచారం ఏ మాత్రం తెలియదని చెప్పారు. ముఖ్యమంత్రిగా విజయభాస్కర రెడ్డి పదవీ బాధ్యతలు స్వీకరించాక రాష్ట్రాభివృద్ధికి తీవ్రంగా కృషి చేస్తున్నారు. పొగాకు ... దరలను పెంచేందుకు ... సంప్రదించి రంగంలో దించడం వల్ల రైతులకు ఎంతో మేలు చేకూరుతుంది. ... ద్వారా 30 వేల పత్తి బేళ్ల కొనుగోలు ... వ్యవసాయ ఉత్పత్తుల ధరల

కొరవ 10 వ పేజీలో

# రొయ్యల పెంపకం ఇంత విస్తారంగా పెరిగిపోయి వుందా?

నెల్లూరు జిల్లా రొయ్యల పెంపక దారుల సంఘం ప్రారంభోత్సవ సభ 23 తేది ఆదివారం ఇందిరాభవన్‌లో అడంబరంగా జరిగింది. కేంద్ర వాణిజ్య మంత్రి శ్రీ కమాలుద్దీన్ అహమ్మద్ సంఘాన్ని ప్రారంభించారు.

నెల్లూరు జిల్లాలో రొయ్యల పెంపకం శరవేగంగా అభివృద్ధి చెందుతున్నదన్న సంగతి తెలిసిందే కాని అది అప్పటికే అంత విస్తారంగా పెరిగిపోయిందా అన్పించింది- సమావేశంలో రద్దీ చూస్తే! దాదాపు 300 మంది రైతులు పాల్గొన్నారు. పాల్గొనని రైతుల సంఖ్య అంతకు అంత వుంది. ఉదయం రైతు సదస్సు; పలువురు రైతులు తమ సమస్యలను వివరిస్తూ మాట్లాడారు. తమ సంఘం తీరుతెన్నులు, స్వరూప స్వభావాలపై చర్చ జరిగింది. సదస్సును ఎంపిఇడిఎ డిప్యూటి డైరెక్టర్ డాక్టర్ లోక్రా అధ్యక్షించారు. రైతుల పక్షాన శ్రీ సామంతు గోపాలరెడ్డి, శ్రీ వేమారెడ్డి సుందరరామిరెడ్డి, శ్రీ డి. వినయ కుమార్‌రెడ్డి, శ్రీ సి.సబ్బీర్ ఖాన్, శ్రీ సురేష్‌బాబు, శ్రీ సాయిబాబయ్య, శ్రీ సుబ్బారావు, శ్రీ డి రాధాకృష్ణారెడ్డి, శ్రీ నయీమ్, తదితరులు మాట్లాడారు.

సాయంత్రం ప్రారంభోత్సవ సభను ఎంపిఇడిఎ ఛైర్మన్ డాక్టర్ ఎం. శక్తివేల్ అధ్యక్షించారు. సంఘం గౌరవాధ్యక్షుడు శ్రీ పిపి ప్రసన్నరెడ్డి రైతులకు డీమ్డ్ ఎక్స్‌పోర్టర్ స్టేటస్ కల్పించి ఇన్‌కంటాక్స్, కస్టమ్స్ డ్యూటీ రాయితీలు కల్పించాలని కోరారు; అధ్యక్షుడు నెల్లూరు దోలేంద్ర ప్రసాద్ 14 కోర్కెలతో వినతిపత్రం సమర్పించా- సంఘం తరపున ఒక అధునాతన ప్రయోగశాల, లైబ్రరీ

### రొయ్యల రైతు సంఘం సభ

స్థాపించ తలపెట్టామని. దీనికయ్యే పది హేను లక్షల రూపాయల వ్యయాన్ని ప్రభుత్వంపై ఆధారపడకుండా, విరాళాల రూపంలో సేకరించి, సహకార విధానంలో నిర్వహించాలన్నది సంకల్పమని చెప్పారు. దీనికి సంజందించి రైతులు, కంపెనీల నుంచి అప్పటి కప్పుడే నాలుగైదు లక్షల వరకు వాగ్దానాలు లభించాయి.

నెల్లూరు ఎమ్మెల్యే శ్రీ జెకెరెడ్డి రాష్ట్ర ప్రభుత్వం రొయ్యల పెంపకాన్ని ప్రోత్సహించడానికి ప్రాథమిక వసతుల కల్పన చేయాలని కోరారు. పార్లమెంట్

కొరవ 10 వ పేజీలో

జమీన్‌రైతు
సంవత్సరచందా రూ. 100/-
ఆరు నెలలకు రూ. 50/-
విడిప్రతి రూ. 2.00

## అభినందనలు

21, 22, 23 తేదీలలో నెల్లూరు మెక్లిన్స్ క్లబ్ ఆధ్వర్యంలో క్రీన్స్ ఇండియన్ క్లబ్ వారు నిర్వహించిన అంతర్ రాష్ట్ర చెస్ పోటీలలో తృతీయ బహుమతి పొందిన



చిరంజీవి యల్.వి. శివ కుమార్‌ను

(ఇంటర్ సీనియర్ – వి.ఆర్. కాలేజి)

అభినందిస్తూ ఇంకెన్నో కీర్తి శిఖరాలను అధిరోహించాలని ఆకాంక్షిస్తున్నాము.

– మిత్రులు

**In the Court of the District Judge: Nellore**

E.A. No. 1/92, E.A. No. 2/92
E.A. No. 3/92
E.P. No. 39/1989
O.S. No. 26/1976

1. Peteti Suseelamma,
2. Peteti Subbaiah Setty,
3. Pokuru Sankunthala
-Petitioners/DHrs

Vs

Peteti Sarojanamma,
W/o. Peteti Krishna Murthy & others
- Respondents/JDrs

### నోటీసు

3. పుట్టా ఇంద్రాణి,
W/o. P. సత్యనారాయణ
5) పెటేటి పవన్ కుమార్,
S/o. P. కృష్ణమూర్తి, 12/888,
సంతపేట, నెల్లూరు అనువార్లకు

తెలియజేయడం ఏమనగా

పై నంబరు డిక్రీ హోల్డర్లు మిమ్మల్ని, మీ తల్లిని, మీ అన్నదమ్ములను, మీ తండ్రి పెటేటి కృష్ణమూర్తి గారి వారసులుగా (Legal Representatives) పై నంబరు E.P. 39/1989 E.A. 53/1989 and E.A. 54/1989 లో చేర్చమని కోరుచూ పిటీషన్లు పెట్టి వున్నారు. సదరు పిటీషన్లు మీ నోటీసు నిమిత్తమై 28.6.93 తేదిన వున్నది. కాన ఆ రోజు ఉదయం 10.30 గంటలకు పై కోర్టులో మీరు ఖుద్దన గానీ, వకీలు ద్వారా గానీ మీకు ఆక్షేపణలున్న యెడల తెల్పుకొన వచ్చును. లేని యెడల మీ పరోక్షమున సదరు పిటీషన్లు తీర్మానము చేయబడును.

సర్వేపల్లి మల్లికార్జున శర్మ
పిటీషనర్లు/ డిక్రీహోల్డర్ అడ్వొకేటు

# శివారెడ్డి పద్యాలు

### మంత్రి పదవి

మంత్రి పదవి వస్తె మందాకిరావిస్తె
కలదు భుక్తి ముక్తి కాంగ్రెసైన
తెలుగుదేశమైన కవివినే కాదన్న
అందరొకటె. తేడ అంతొ యింతొ

మాట నిజం తొప్ప మాసెవ్వరగ వళ్ల
అల్లి బుల్లి కూళ్లు పల్లెపట్ల
నాల్గో క్రొత సృష్టి నానాట పెరిగింది
చెప్పగాదు చెపితే ముప్పు కొసది!

### ఫలితాలు

ఎవ్వరొచ్చి చేసేదేముంది? పాల్టీస్సు
ఖర్మ సంకటమ్ము గాకపోతె
మూడ్డినాల భోగం ముప్పై ఈ ఎమ్మెల్లే
పదవి కోట్ల ఖర్చు పాడు పీడ!

### మాగుంట సుబ్బరామరెడ్డి

ఖర్చు పెట్టినావు కోట్లాది దవ్యాన్ని
తిరిగినావు నీకు తీరికేల!
నీవు బర్ద శ్రమలు నేనెట్లు వర్ణింతు
సుబ్బరామా! ఏమి నిబ్బరము !

## జనవాణి

(3 పేజీ కొరవ)

యాజమాన్యం, రచయితా అభినందనీయులు.

నెల్లూరు - భట్టారం పట్టాభిరామయ్య

'జమీన్‌రైతు' లో అయినా రైతు సమస్యల గూర్చి వారం వారం ఒక శీర్షిక ప్రవేశ పెట్టమని మనవి.

–ఒక రైతు

### పోలింగు సమయం మార్చాలి

ఎన్నికల పోలింగ్ షెడ్యూల్‌ను వుదయం 7 గంటల నుండి సాయంత్రం 5 గంటలుగా పెట్టి యున్నారు. కాని ఈ సమయం ఎంతో మందికి ఇబ్బంది కల్గిస్తున్నది. ఎలక్షన్ డ్యూటీకి వచ్చే మహిళా వుద్యోగినుల పరిస్థితి వర్ణనాతీతం. అసలు సాయంత్రం 4 గంటల మీద జరిగేది పోలింగ్ కాదు. రిగ్గింగ్, దొంగ ఓట్ల కార్యక్రమమని ప్రతి చోటా తెలిసి పోయినా ఐదు గంటల వరకు కొనసాగించటంలో అర్థం లేదు.

రాముడుపాళెం – కె. రామసుబ్బారెడ్డి

### హిల్ రిసార్ట్స్

ఈ నెల 7 తేది తిరుపతిలో 'హిల్‌రిసార్ట్స్' ప్రారంభించారు. సభ్యత్వ చందా 18 వేలు. 20 సంవత్సరాల తర్వాత తిరిగి ఇస్తారు అయితే గ్యారంటీ నిల్. సభ్యులకు త్రీ స్టార్ హోటల్‌లో సంవత్సరానికి మూడు రోజుల బస, హెల్త్ క్లబ్‌లో మాలీష్, దైవదర్శనం ఏర్పాట్లు రిసార్ట్స్ వారు చేస్తారట. బహుశా ప్రవాస భారతీయులను వుద్దేశించి ఈ పథకం ప్రారంభించినట్లుంది. ఫైనాన్సులు, రియల్ ఎస్టేటులు... ఇప్పుడేమో హిల్ రిసార్ట్స్ మొత్తానికి మంచి వ్యాపారమే!

నెల్లూరు – ఎస్. కె. ఆచార్యులు

### రైతు సమస్యలను రాయండి

ఈ రోజుల్లో వ్యవసాయ వుత్పత్తుల ధరలు దారుణంగా పడి పోతున్నాయి. మిర్చి, పొగాకు, వరి ఇతర వ్యవసాయ వుత్పత్తుల ధరలు ప్రభుత్వం నిర్ధారించిన ధర కన్నా పడిపోయాయి. వ్యవసాయ పెట్టుబడులు దారుణంగా పెరిగి పోతున్నాయి. వ్యవసాయం నేడు గ్యారంటీ లేని పెట్టుబడిగా తయారై పోతుంది. రైతు భూమిని నమ్ముకొని వ్యవసాయం చేయడం నేరమా? తిండి గింజలు పండించడం నేరమా? అసలు వ్యవసాయ వృత్తిని స్వీకరించడమే దౌర్భాగ్యమా? రైతు దుస్థితిని ఈనాడు ఏ పత్రికలూ రాయడం లేదు. వ్యాపార ధోరణిలో కొనసాగుతున్నాయి.

### వెన్ను పై దెబ్బతగిలినా నపుంసకత్వం రాదు!

వెన్ను మీద దెబ్బ తగిలితే పురుషుడు నపుంసకుడ వుతాడని కొందరు రచయితలు కథలు వ్రాస్తున్నారు. కొన్ని సినిమాలు కూడా యీ భావాన్ని ప్రచారం చేస్తున్నాయి. నిజానికిది విద్యావంతుల్లో ప్రచార మవుతున్న మూఢ నమ్మకం మాత్రమే. వెన్ను పై బలమైన దెబ్బ తగిలిన కొందరిలో పారాప్లెజియా సంభవిస్తుంది. అంటే దెబ్బతగిలిన చోటు నుండి క్రింది శరీరం మొత్తం స్పర్శనూ, చలనాన్నీ కోల్పోతుంది. వీళ్లు వీల్‌చేర్‌కు అంకితమై పోతారు. ఇలాంటి వాళ్లలో చాలా మందికి నపుంసకత్వం సంభవిస్తుంది ( వీళ్లలో కూడా అందరికీ కాదు). అలాంటిదేమీ లేకుండా దెబ్బ తగిలిన పిదప కొంత కాలం విశ్రాంతి తర్వాత మామూలుగా నడవ గలిగే వ్యక్తులలో నపుంసకత్వం సంభవించడం అసంభవం.

–డాక్టర్ ఇ. రాజగోపాల రెడ్డి
నెల్లూరు

### చెన్నా

మొదటి పేజీ కొరవ

అక్కడ గవర్నర్‌గా అన్ని అధికారాలు చెలాయించ వచ్చు పైగా తమిళనాడు మన రాష్ట్రానికి పక్కనే ఉండటంతో స్వరాష్ట్రంలో తిరిగి క్రియాశీలక రాజకీయాలు జోరుగా కొనసాగించే అవకాశ ముంటుంది. కాబట్టి చెన్నా తమిళనాడుకు వచ్చేందుకు తలూపారు. చెన్నా నియామకం తమిళనాడు ముఖ్యమంత్రి జయలలితకు ససేమిరా ఇష్టం లేదు. అలాగే చెన్నా పొరుగు రాష్ట్రానికి రావడం కోట్లకు కూడా కొరుకుడు పడటం లేదు. ఇటీవల బ్లిట్జ్ పత్రికకు యిచ్చిన ఇంటర్వ్యూలో చెన్నా వెలిబుచ్చిన అభిప్రాయాలను బట్టి చూస్తే త్వరలోనే ఆయన రాష్ట్ర రాజకీయాల్లో వేలు పెట్టే అవకాశ ముంది. కాబట్టి ఎక్కడో దూరంగా రాజస్థాన్‌లో వున్న చెన్నాను పక్క రాష్ట్రానికి తెచ్చి ''పక్కలో బల్లెం'' గా వుంచడం ముఖ్యమంత్రికి ఇబ్బందికరమైన విషయమే.

### అవినీతి మంత్రులు

మొదటి పేజీ కొరవ

విషయంలో వెనకా ముందు చూడకుండా పోతేనే ముఖ్యమంత్రికి ''క్లీన్'' కితాబు లభిస్తుందని సలహా మండలి సలహా. ఇలా వుండగా రైకలూరు, కోవూరు పరాజయం తర్వాత జిల్లాల వారీగా పార్టీని నడుపుక పోయే వారి కోసం ముఖ్యమంత్రి గాలిస్తున్నట్లు తెలుస్తోంది. మంత్రి అన్నాక కనీసం తన సొంత జిల్లాలో నైనా నెగ్గుక రాకపోతే ఎలా? అని ముఖ్యమంత్రి అంటున్నారట. ప్రస్తుతం వున్న ఎమ్మెల్యేల్లో జిల్లా నాయకత్వాన్ని నడప గలిగే సమర్థుల కోసం అన్వేషణ పూర్తయిందని, ముఖ్యమంత్రి తన మార్కు మంత్రి వర్గం విషయంలో ఇప్పటికే ఒక అభిప్రాయానికి వచ్చారని అంటున్నారు. ఈ నెలఖారులో అమేథిలో ఏఐసిసి సమావేశాలు ఉన్న కారణంగా వచ్చే నెల మొదటి వారంలో మంత్రి వర్గం మార్పులు చేర్పులు జరపవచ్చు.

### జిల్లా వార్తలు

9 పేజీ కొరవ

పెంపకానికి తగిన చర్యలు తీసుకొని రైతును ఆదుకొన్నట్లు చెప్పారు. ఇప్పటి కెప్పుడు ఇవ్వనున్నట్లుగా లక్షా 20 వేల పంపు సెట్లకు రికార్డు స్థాయిలో విద్యుత్ కనెక్షన్‌లు ఇచ్చాం. దాని వల్ల 11.80లక్షల మంది రైతులు లబ్ధి పొందుతారని వివరించారు. విద్యుత్ సౌకర్యం మెరుగు పర్చను 93-94 సంవత్సరంలో 949 కోట్లు ఖర్చు చేస్తున్నాం. దేశంలో వారం క్రితం 6 విద్యుత్ ప్రాజెక్టులు మంజూరైతే మన రాష్ట్రానికి 3 వుండడం గర్వకారణమని మంత్రి చెబుతూ రోడ్ల నిర్మాణానికి ఎన్నడూ లేనంతగా 417 కోట్లు కేటాయించి పనులు ప్రభుత్వంగా పైరోపణ చేసుకున్నట్లు చెప్పారు.

### రొయ్యలు

9 పేజీ కొరవ

సభ్యుడు శ్రీ మాగుంట సుబ్బరామరెడ్డి జిల్లాలో అనువుగా వున్న రెండు లక్షల ఎకరాలను రొయ్యల పెంపకంలోకి తీసుక రాగల్గితే వేలాది కోట్ల విదేశీ మారక ద్రవ్యం ఆర్జించవచ్చుని, రైతులకు కావలసిన సహాయం ఏదైనా తన శక్తివంచన లేకుండా చేస్తానని ప్రకటించారు.

ఛైర్మన్ డాక్టర్ శక్తివేలు మాట్లాడుతూ- ఆంధ్ర ప్రదేశ్‌నుంచి గత సంవత్సరంలో 400కోట్ల రొయ్యల ఎగుమతి జరిగితే, అందులో 250 కోట్లు రైతులు పండించినవే నన్నారు. 1800 కోట్లుగా వున్న సముద్రపు ఉత్పత్తుల ఎగుమతులను ఈ ఏడాది రెండువేల కోట్లకు పెంచాలనే లక్ష్యం వుందని, విదేశాలనుంచి దిగుమతి చేసుకొనే మేత, పరికరాలకు పూర్తి కస్టమ్స్ డ్యూటీ మినహాయింపు కల్పించడానికి ఢిల్లీలో ప్రయత్నిస్తున్నామని చెప్పారు.

మంత్రి శ్రీ కమాలుద్దీన్- ప్రపంచ మార్కెట్‌లో భారత రొయ్యలకు నాణ్యతా పరంగా అత్యంత విలువ కలిగేటట్లు ఉత్పత్తి విషయంలో రైతులు జాగ్రత్త తీసుకోవాలని సలహా ఇచ్చారు. ప్రభుత్వ పరంగా రైతులకు పూర్తి సహకారం వుంటుందని మాట ఇచ్చారు.

సభను తొలుత సంఘం ఆర్గనైజింగ్ సెక్రటరీ శ్రీ కె.మధుసూధనరెడ్డి స్వాగతించారు, సెక్రటరీ శ్రీ పి. షబ్బీర్ ఖాన్ నివేదిక సమర్పించారు, సహాయ కార్యదర్శి శ్రీ సురేష్ బాబు వందన సమర్పణ చేశారు.

## పంచాంగము

### చంద్రగ్రహణము

తేది 4 శుక్రవారము పూర్ణ చంద్ర గ్రహణం సాయంత్రం 4.38 మొదలు రాత్రి 7.16 గంటల వరకు

### ముహూర్తములు

తేది 30 ఆదివారము ఉదయం 8.00 గంటలకు మిధున లగ్నమున వ్యాపారారంభ వివాహములకు సుముహూర్తములు కలవు.

### మే నెల తిథులు

జ్యేష్ట శుద్ధ
తే 29శని అష్టమి ఉ.గ. 9.26వ
తే 30ఆది నవమి ఉ.గ. 7.00 వ
తరువాత పూర్తి దశమి
తే 31సోమ ఏకాదశి రా.గ. 3.00 వ
జూన్ నెల తిథులు
తే 1 మంగళ ద్వాదశి రా.గ. 11.45 వ
తే 2 బుధ త్రయోదశి రా.గ. 9.44 వ
తే 3 గురు చతుర్దశి రా.గ. 8.00 వ
తే 4 శుక్ర పూర్ణిమ రా.గ. 6.56 వ

స్వయంపాకుల శ్రీనివాసులు
ఎం.ఏ

### నీటిమట్టం

| | |
|---|---|
| నెల్లూరు చెరువు | 11.5అ |
| సర్వేపల్లి రిజర్వాయరు | 2.1అ |
| కనిగిరి రిజర్వాయరు | 12.5 " |



### నెల్లూరులో ఎండ

| | |
|---|---|
| 22 తేది | 98.6 |
| 23 తేది | 102.3 |
| 24 తేది | 104.9 |
| 25 తేది | 108.5 |
| 26 తేది | 107.7 |
| 27 తేది | 96.8 |

### నెల్లూరు బజారు

| | |
|---|---|
| మొలగొలుకులు | |
| 9672 (పాతవి) | 3,900/- |
| 9672 (కొత్తవి) | 3,200/- |
| 9674 (కొత్తవి) | 3,400/- |
| ఐ.ఆర్. 20 | 2,400/- |
| బియ్యం బస్తా (70 కేజీలు) | 540/- |
| బియ్యం (కేజి) | 8/- |
| బంగారు సవర (8 గ్రా) | 3,400/- |
| వెండి (10 గ్రా) | 65/- |
| పెసలు (100 కిలోలు) | 950/- |
| వేరుశనగ నూనె (కేజి) | 27.50/- |
| మిరపకాయలు (కేజి) | 20/- |
| చింతపండు (కేజి) | 16/- |
| చక్కెర (కేజి) | 11.80/- |
| బెల్లం (కేజి) | 13/- |
| కందిపప్పు (కేజి) | 18/- |
| పెసర పప్పు (కేజి) | 15/- |
| మినప పప్పు (కేజి) | 10.50/- |

# అర్జున్ కి సందేహం

గతంలో "మా పల్లెలో గోపాలుడు, మన్నెంలో మొనగాడు, మనసుతో పెళ్లాడుతా, ముఠామేస్త్రి" వగైరా చిత్రాలలో నటించిన హీరో అర్జున్ "ఆ నాలుగు చిత్రాల తర్వాత నన్ను తెలుగులో ఏ నిర్మాతా బుక్ చేయలేదు. కాని, తమిళంలో, కన్నడంలో నేను నటించిన చిత్రాలు తెలుగులోకి డబ్ చేయబడితే కొనడానికి కొనుగోలుదారులు ఎగబడుతున్నారు. ఏమిటో ఈ చిత్రం" అని తన విస్మయాన్ని వెలిబుచ్చారు. జతను మాలశ్రీ నటించిన "ప్రేమాభిషేకతల్లి" అనే కన్నడ చిత్రం "పౌరుషం"గా తెలుగులో డబ్ చేయబడుతోంది. సంగీతం: రాజ్-కోటి, సమర్పణ: డాక్టర్ వేముల రెడ్డి, ఎగ్జిక్యూటివ్ నిర్మాత: బి.ఏ. రాజా, నిర్మాత: వై.ఎస్. రెడ్డి, దర్శకత్వం: క్రైమ్. అర్జున్ నటించిన "తంగతామరై" తమిళ చిత్రం [illegible] అవుతోంది. రూపిణి నాయిక.

## భానుప్రియ సొంత చిత్రం

హీరోయిన్లు లేనప్పుడు స్వంతంగా సినిమా నిర్మించడం కొందరు తారలకు రివాజు. భానుప్రియ ఇది వరకు రెండు తమిళ చిత్రాలు నిర్మించింది. అయితే, అవి హీరోకు ప్రాధాన్యత గల చిత్ర కథలవడం వల్ల అంత బాగా ఆడలేదేమో నని భానుప్రియ అభిప్రాయం. త్వరలో ఆమె నిర్మించబోయే చిత్రంలో నాయిక పాత్రకే ప్రాధాన్యత ఉండాలట. కథను ఎంపిక చేసే బాధ్యత తనదేనట.

మెకానిక్ అల్లుడు చిత్రంలో సత్యనారాయణ, చిరంజీవి, అక్కినేని

# మహేష్‌కు 30 లక్షలు?

చాలా కాలం తర్వాత హీరో కృష్ణ పుత్రుడు మహేష్ బాబు త్వరలో ఇ.వి.వి. సత్యనారాయణ దర్శకత్వంలో సూర్యా రికార్డింగ్ సంస్థ నిర్మించే చిత్రంలో నటించనున్నారు. బాలిక బృందం - దింపుల్ కపాడియా పుత్రిక [illegible] అప్పుడే - మహేష్ బాబును బుక్ చేయడానికి చాలా మంది నిర్మాతలు ఎగబడుతున్నారు. ఒక నిర్మాత 30 లక్షలు ఇవ్వడానికి సిద్ధపడ్డారు కూడా. ఇది అనారోగ్యమైన పోటీ - అని మరో నిర్మాత వ్యాఖ్యానించారు.

## తెలుగు సినీ రచయితల సమాఖ్య

ఇది వరకు ఆచార్య ఆత్రేయ అధ్యక్షుడుగా తెలుగు సినిమా రచయితల సంఘం ఒకటుండేది. అది ఆయనతోనే పోయింది. ఇప్పుడు ఆయన జన్మదినమైన మే 7 తేదీన తెలుగు సినీ రచయితల సమాఖ్యకు అంకురార్పణ జరిగింది. అధ్యక్షుడు: డి.వి. నరసరాజు, గౌరవ అధ్యక్షుడు: ఆరుద్ర, ఉపాధ్యక్షులు: వేటూరి, జంధ్యాల, ప్రధాన కార్యదర్శి: పరుచూరి వెంకటేశ్వర రావు, సహకార్యదర్శులు: వెన్నెలకంటి, ఆకెళ్ల, కోశాధికారి: భమిడిపాటి రాధాకృష్ణ.

# వాణిశ్రీకి, జయచిత్రకు ఎక్కడుంది పోలిక?

అప్పనంటూరు హిందీ "బేటా" చిత్రం ఆధారంగా వెంకటేష్‌తో "అబ్బాయిగారు" చిత్రం నిర్మిస్తున్న రాశీ మూవీస్ అధినేత నరసింహ రావు "బొబ్బిలి యువ్వనం కాటేసింది, సాహసగాళ్లు, చిల్లరకొట్టు చిట్టెమ్మ, రావణుడే రాముడైతే, కటకటాల రుద్రయ్య" వంటి చిత్రాలలో నటించిన జయచిత్ర చక్కని నటి. ఎవరూ కాదనరు. కాని, ఆమెను అగ్ర నటీమణులైన వాణిశ్రీ, శారదలతో పోల్చడమెందుకు? ఈ అగ్ర నటీమణులు నటించిన విభిన్నమైన క్లిష్టమైన పాత్రలను జయచిత్ర నటించలేదే.

## జయప్రద నటించే టెలీ సీరియల్

ఇది వరకు టెలీ సీరియల్‌లో నటించమని జయప్రదను కొందరు నిర్మాతలడిగితే "ఛీ! నా కంత ఖర్మం పట్టింది?" అనేదట. కాని, ఇటీవల దీపక్‌కుమార్ నిర్మించే "సంసార్" హిందీ సీరియల్‌లో ప్రధాన పాత్ర ధరించడానికి అంగీకరించింది.

## కోదండరామిరెడ్డి దర్శకత్వంలో నాగార్జున

"గ్రామీణ, నగర వాతావరణ నేపథ్యంలో వినోదాత్మకమైన చిత్రం. సెంటిమెంట్ కూడా పుష్కలంగా వుంటుంది. నాగార్జున, నగ్మా, నాగార్జున, మీనాల పై రెండు పాటలు, కొన్ని సన్నివేశాలు ఊటీలో చిత్రీకరించాం. హైదరాబాదులో చివరి షెడ్యూల్ ఆగస్టు 15 నుంచి నెలాఖరు వరకు ఉంటుంది" అన్నారు నెల్లూరీయుడు కోదండరామిరెడ్డి. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో డి. శివప్రసాద్ రెడ్డి నిర్మించే కామాక్షి ఆర్ట్ మూవీస్ చిత్రంలో ఇంకా వాణిశ్రీ, రావుగోపాల రావు, కోట శ్రీనివాస రావు, బ్రహ్మానందం, బాబూమోహన్ నటిస్తున్నారు.

## నాగార్జున సరసన శ్రీదేవి

"జూలై 1 న హైదరాబాదులో ప్రారంభోత్సవం" అన్నారు వైజయంతీ మూవీస్ అధినేత అశ్వనీదత్. ఈయన నిర్మించే చిత్రంలో "ఆఖరి పోరాటం" తర్వాత నాగార్జున - శ్రీదేవి కలసి నటిస్తున్నారు.

# సబ్సిడీకై 120 చిత్రాల ఎదురుచూపు

రాయితీల కోసం ప్రభుత్వం వద్ద ప్రస్తుతం 120 ఫైల్స్ పెండింగ్‌లో ఉన్నాయి. రాయితీలు ఎప్పుడు అందుతాయా అని నిర్మాతలందరూ ఎదురు చూస్తున్నారు. కాని, ప్రభుత్వానికి అంత కన్నా గమనించాల్సిన ఎన్నో ముఖ్యమైన విషయాలున్నాయి. సినిమా రంగం మన రాష్ట్రంలో స్థిరపడడం కోసం వినోదపు పన్ను నుండి ప్రభుత్వం ఏటా మూడు కోట్ల రూపాయల దాకా వెచ్చిస్తోంది. ఇంత వరకు సబ్సిడీ రూపంలో 30 కోట్ల వరకు ఇవ్వడం జరిగింది. ఇంత జరిగినా తయారయ్యే చిత్రాల సంఖ్య పెరిగిందే గాని, వాసి పెరిగిందా?

## నెల్లూరు సబ్ కోర్టులో

I.A. 1084/91 : O.S. 114/90

ఆంధ్రా బ్యాంక్ - పిటీషనర్

Vs

కె. పిచ్చయ్య, యస్. భాగ్యలక్ష్మి - రెస్పాండెంట్లు

పై చెప్పిన ఫైనల్ డిక్రీ అప్లికేషన్ రెస్పాండెంట్లకు నోటీసుగా 18.6.93 తేదీకి వాయిదా వేయబడి వున్నది. వారికేదైనా ఆక్షేపణలున్న ఆ తేది ఉదయం 10.30 గంటలకు కోర్టు వారికి తెలుపుకోవని ఎడల వారి పరోక్షములో తీర్మానించబడును.

**మేనకూరు ఆదిశేషారెడ్డి**

పిటీషనరు వకీలు

## రామచంద్రాపురం సబార్డినేటు జడ్జి కోర్టులో

O.S. 69/87 : E.P. 11/92

Between:

మేడిశెట్టి సత్యనారాయణ (died) వగైరా - డిక్రీ హోల్డరు

and

పంపన వాగేశ్వర రావు వగైరా - జె.డి.ఆర్స్

యీ దిగువ యివ్విన యిస్తిహారు షెడ్యూలు దాఖలా అస్తి 6.7.1993 పగలు 10.30 గంటల లగాయితు పై కోర్టులో బహిరంగ వేలము వేయుదురు. కావలసిన వారు హాజరుకావచ్చును. యిస్తిహారు దాఖలా అస్తిపైని అస్తి అయివున్నది.

షెడ్యూలు: తూర్పు గోదావరి జిల్లా ద్రాక్షారామ సబ్.డి.లో చేరిన పామర్రు మండలం పామర్రు గ్రామంలోని 3 వ వార్డులోని జె.డి.ఆర్స్ స్వార్జిత హక్కు భుక్తములలో యున్నDoor: No. 3.39 గల బంగళా పెంకుటి యింటికి స్థలంకు కొలతలు హద్దులు

తూర్పు: 0 - 81 - 9 రాజువీధి; పడమర: 0 - 65 - 9 రెడ్డివారి వెంకటరావు స్థలం; ఉత్తరం: 0 - 33 - 0 జె.డి.ఆర్స్‌లో యిందుకు గల ఉమ్మడి మార్గం; దక్షిణం: 0 - 31 - 0 కొవసూర్యారావు స్థలం

సదరు హద్దులు మధ్యస్థములోన 263 చగజ్యా 219.06 చ.మీ. స్థలం లోని స్థలం అందులో గల Door No. 3-39 గల బంగాళా పెంకుటిల్లు తలుపులు ద్వార బంధములు పై కప్పు వగయిరాలు యావత్తు సహా వేలం కావలెను.

డిక్రీ హోల్డరు విలువ: రూ. 40,000/-

అమీనా గారి విలువ: రూ. 55,000/-

రామచంద్రాపురం 18.4.93

**గాదేపల్లి గోపాలకృష్ణమూర్తి**

డిక్రీహోల్డరు తరపు అడ్వకేటు

## In the Court of the Addl. Subordinate Judge: Chittoor

O.E.P. No. 53 of 1991

O.S. No. 57 of 1985

Between:

The Nedungadi Bank, Chittoor, rep. by it's Branch Manager .. Decree Holder

M/s. New Textiles Centre Show Room, Chittoor by it's partner J.B.Prabhakar & 2 others .. Judgement debtors

**AUCTION NOTICE**

The Schedule mentioned property of the II Judgement debtor viz., J.B. Victoria, will be sold in the Public Auction in the above said court on 15.06.1993 between 10.30 a.m. to 5.00 p.m. intending bidders may participate in the said auction.

**SCHEDULE**

Chittoor District - Chittoor Sub District - Chittoor Taluk - Chittoor town - Terraced and Tiled house bearing Municipal door No. 14-10-19, New No. 14-4-63 in Khadar Meeran Street with in the following boundaries:

On the South: Vacant site of Kanchipillappa Naicker & Others; On the West: Road left by Kanchipillappa Naciker & others; On the North: House of Parvathamma; and On the East: House of Annayi Saheb & others, House of Parvathamma and a Scavenging lane with measurements.

North to South: 15 feet - 4.574 Meters

East to West: 72 feet - 21.94 Meters

with in the above boundaries terraced building measuring from East to west: 30 feet - 9.14 Meters; North to South: 15 feet - 4.57 Meters i.e., 450 sq. ft. A tiled house East to West 10 feet - 3.04 Meters, North to South: 15 feet - 4.57 Meters with Electricity S.C. and half share in the Northern wall and half share in the draw well.

D.H.s value Rs. 2,00,000.00

Amin's Value Rs. 2,50,000.00

E.C.: Nil

Place: Chittoor

Dt.:15.05.1993

**K. Ramaiah Pillai**

Advocate for D. Holder

## మాలతీ చందూర్

(4 పేజీ కొరవ)

రచయిత్రి కూడా తమ పాఠకులతో ఇంతటి మానసిక సాన్నిహిత్యం పొందగల్గారని చెప్పలేము. అర్చలిస్టుగా శ్రీమతి మాలతీ చందూర్ ఎవరూ సాధించలేని వృత్తిపర సార్థకత పొందగల్గారు వీటి ద్వారా.

రచయిత్రిగానూ ఆమెకు మహిళా లోకంలో అభిమాన కోటి వుంది. నవతరం స్త్రీ, పాతతరం ఛాందసభావ సంకెళ్లను త్రెంచుకొని తన భవిష్యత్‌ను తాను తీర్చిదిద్దుకోవాలని స్ఫూర్తిని ప్రబోధిస్తూ, ఆధునిక మహిళ ఆశలు, ఆశయాలు, స్వప్నాలను ప్రతిఫలింపజేస్తూ, స్త్రీకి వ్యక్తిత్వం వుండాలని ఆకాంక్షిస్తూ మాలతీ చందూర్ గారు వ్రాసిన నవలలు, కథలు ఆరోజుల్లో విపరీతమైన సంచలనాన్ని కల్గించాయి. వైశాఖి అనే నవలలో ఆమె ఒక అభ్యుదయ వాద స్త్రీ పాత్ర ద్వారా తన సామాజిక అవగాహనను పఠితుల కళ్లకు కట్టారు. మానవతావాదం ముందు తీవ్రవాదం ఎట్లా వెలవెల బోతుందో హృద్యంగా చిత్రించారు.

ఆమె నవలలన్నీ కన్నడంలోకి అనువదింప బడ్డాయి. 'ఆలోచనలు' అనే కథానికను ఇంగ్లీషులోకి అనువాదం చేసి ప్రచురించారు. 'సద్యోగం' నవల తమిళం, ఇంగ్లీషు, గుజరాతి భాషలలోకి తర్జుమా చేయబడింది.

మాలతీ చందూర్‌గారు కాలేజీ చదువు చదవకున్నా, డిగ్రీలేవీ లేకున్నా స్వయం ప్రతిభతో, నిరంతర కృషితో బహుభాషా పాండిత్యం సముపార్జించారు. ఎన్నో తమిళ గ్రంథాలను ఆమె తెలుగులోకి అనువదించారు. ప్రపంచ ప్రఖ్యాతి చెందిన ఆంగ్ల నవలలు, సామాజిక స్పృహ కల్గిన ఆంగ్ల రచయితలను ఆమె గత పదహారు సంవత్సరాలనుంచి 'స్వాతి' మాసపత్రిక ద్వారా 'పాతకెరటాలు' శీర్షికన తెలుగు పాఠకులకు పరిచయం చేస్తున్నారు. టాల్‌స్టాయ్, ఆస్కార్‌వైల్డ్, డికెన్స్ వంటి సంక్లిష్ట వైచిత్రులు, శైలులు కల్గిన రచయితలను, వారి రచనలను సైతం సగటు పాఠకుడికి అర్థమయ్యేటట్లు వివరించి చెప్పడంలో ఆమెకు ఆమే సాటి.

మద్రాసు, విజయవాడ రేడియో కేంద్రాల ద్వారా ఆమె పలు మహిళా సమస్యలపై ఉపన్యాసాలిచ్చారు. టివి చర్చాగోష్ఠులలో పాల్గొన్నారు. ఆమె రచించిన "నాలాగా ఎందరో" నాటిక ఢిల్లీ టివి నుంచి ప్రసారమైంది.

అవార్డులు, సత్కారాలు మాలతీ చందూర్ గారి జీవన శైలిలో ఒక భాగం క్రింద లెక్క. స్వభావరీత్యా ఆమె సత్కారాలు, సన్మానాలకు విముఖురాలు. అయినా విచిత్రమా వద్దన్నా అవి ఆమెను వెన్నుముడుతుంటాయి. 1985లో మాదిరెడ్డి సులోచన అవార్డు, 1987లో ఆంధ్ర సాహిత్య అకాడమీ అవార్డు, 1988లో మద్రాసు తెలుగు అకాడమీ అవార్డు, 1989లో సుచేలా నారాయణరెడ్డి అవార్డు, 1990లో వాసిరెడ్డి రంగనాయకమ్మ అవార్డు ఆమెకు లభించాయి. 1992లో తిరుపతి పద్మావతి విశ్వవిద్యాలయం ఆమెను డాక్టరేట్‌తో సత్కరించింది.

విటన్నింటిని మించినది 1992లో లభించిన భారతీయ భాషాపరిషత్తు పురస్కారం. ఈ అవార్డును అందుకున్నది ఇద్దరే ఇద్దరు తెలుగువారు. డాక్టర్ సి. నారాయణరెడ్డి, స్వర్గీయ పుట్టపర్తి నారాయణాచార్యులు. వారి తర్వాత ఆ అవార్డు ఆమెకు లభించడంలోనే మాలతీ చందూర్ ప్రతిభ, పాటవాలు వ్యక్తమౌతాయి. ఈ అవార్డు స్వీకరించిన మహిళలలో కూడా ఆమె తృతీయురాలు! కేంద్రసాహిత్య అకాడమీ పురస్కారం సైతం ఆమెకు ఈ ఏడాది లభించింది.

పాత్రికేయత్వంతో పాటు రచయిత్రిగా కూడా ఇంతటి ప్రాచుర్యం పొందిన మరొక మహిళ ఆంధ్రదేశంలో లేదు; ఆ బహుముఖ ప్రజ్ఞాశీలికి, బహుభాషా పండితురాలికి, ఆంధ్ర మహిళల అభిమాన రచయిత్రికి రామానాయుడు గారి అవార్డు ప్రదానం చేయడం, అవార్డుకే గౌరవం చేకూర్చడంగా భావిస్తున్నాము.

## కోట్ల

2 పేజీ కొరవ

ఉపఎన్నికకు సూర్యప్రకాష్ రెడ్డి పోటీ చేసేందుకు వీలుగా సిఎం ఆయనకు కర్నూలు జిల్లాలో ఫ్రీ హ్యాండ్ ఇస్తున్నారని అంటున్నారు. త్వరలో తాను రాజకీయాల్లోకి వస్తున్నట్లు ప్రకాష్ రెడ్డి ఇటీవలే బహిరంగ ప్రకటన కూడా చేశారు. దీనితో కర్నూలు జిల్లాలోని కోట్ల వ్యతిరేక వర్గం అప్పుడే అసమ్మతి కత్తులు సిద్ధం చేసుకుంటున్నారు.

రాష్ట్రంలో 12 డిస్టిలరీల మంజూరు కుంభకోణంలో ప్రకాష్ రెడ్డి హస్తం వుందని ప్రతిపక్షాలు గతంలో చేసిన ఆరోపణలకు పదును పెట్టుకోవటంతో పాటు ముఖ్యమంత్రి కుమారుడు రాజ్యాంగేతర శక్తిగా వ్యవహరిస్తున్న తీరు పై కన్నేసి వుంచాయి.



## శ్రీ అలఘునాథ స్వామి మరియు అంజనేయ స్వామి వారి దేవస్థానం

నిడిముసలి

### భూముల వేలం

నెల్లూరు జిల్లా నిడిముసలి గ్రామంలోని మా దేవస్థానంనకు సంబంధించిన ఈ దిగువ తెలిపిన నిడిముసలి గ్రామ భూములను Endowments Commissioner, హైదరాబాదు వారి M2/30156/91, Dt. 19.3.1993 ఉత్తర్వు ప్రకారం 11.6.93 తేది ఉ. 10 గంటలకు నెల్లూరు అసిస్టెంటు కమీషనర్ వారి సమక్షమున నిడిముసలి, మహాలక్ష్మమ్మ దేవస్థానం వద్ద వేలం వేయబడును. ఏ కారణము చేత గాని వేలం నిలుపుదల చేయుటకు గాని, ఇతర మార్పులు చేయుటకు గాని దేవస్థానం వారికి సర్వ హక్కులు కలవు. వేలం పాటలో పాల్గొను వారు రూ. 5000/- ధరవాత్తు చెల్లించి వేలంలో పాల్గొన వలయును. ఇతర వివరములకు వేలంనకు ముందు తెలుసుకొన వచ్చును.

| ప్లాట్ నెం. | సర్వే నెం. | విస్తీర్ణం |
|---|---|---|
| 1. | 246/A | 1-01 |
| | 246/B | 1-02 |
| 2 | 147 | 1-22 |
| 3 | 310 | 3-88 |

**గణేశం కృష్ణారెడ్డి**

ఛైర్మన్



G.O.I. M.O.C

## DEPARTMENT OF TELECOMMUNICATIONS

(Providing Vital Infra-Structure for National Building)

No. B-1, Rlgs/II/26, Dated at Nellore, the 25.05.1993.

Wanted Office accommodation for Zonal Offices for JTOs in 1) Pogathota area and another in Dargamitta area in Nellore town. The carpet area requirement is approximately 1400 sq.ft. 130 sq. m. with all the required facilities like toilets, cycle shed etc.,

Interested parties may send their offer in a sealed cover to the undersigned on or before 15.06.1993 with details of space available, proposed rent, location and terms and conditions if any.

**Y. Sivasankar Reddy**
Telecom District Engineer,
NELLORE - 524 050.

# నెల్లూరు వీరత్వానికి ప్రతీక ఖడ్గ తిక్కన

పది మూడవ శతాబ్దపు నెల్లూరు సీమకు చెందిన చారిత్రాత్మక వీర గాథ ''ఖడ్గ తిక్కన'' రణరంగ చరిత్ర. ఈ ఇతివృత్తం ఆధారంగా గ్రిద్దలూరు గోపాల రావు రచించిన ''ఖడ్గతిక్కన'' నాటకం నెల్లూరు శ్రీ రామకృష్ణ నాట్యమండలి వారి నిర్వహణలో 30 తేది ఆదివారం పగలు 12 గంటలకు టి.వి.లో ప్రసారమవుతుంది.

నెల్లూరు సీమను పాలించిన మనుమసిద్ధి రాజా ఆస్థానంలో ఖడ్గ తిక్కన దండనాధుడు గాను, ఆయన పిన తండ్రి కుమారుడు కవి తిక్కన మంత్రి గాను జగద్విఖ్యాతి గాంచారు. ఎర్రగడ్డ పాటిని పాలించే కాటమరాజు తన పశువులను నెల్లూరు సీమలో మేపుకున్నందుకుగా మనుమసిద్ధి రాజుకు పుల్లరి చెల్లించలేదు. పుల్లరి వసూలుకు రాయబారిగా వెళ్లిన ఖడ్గతిక్కన కాటమరాజుచే అవమానింప బడతారు. యుద్ధం తథ్యమవుతుంది.

ఖడ్గతిక్కన కాటమరాజును యుద్ధభూమిలో ఎదుర్కొంటారు. కాటమరాజు సమీకరించిన ఇరుగు పొరుగు రాజుల అధిక సైన్యం, ఖడ్గతిక్కన తీసుక పోయిన కొద్ది సైన్యాన్ని హతమారుస్తుంది. విధి లేని పరిస్థితుల్లో ఎక్కువ సైన్యం సేకరించేందుకు ఖడ్గ తిక్కన ఇంటికి

### టెలిఫిలిం ప్రివ్యూ

వస్తారు. శత్రువుకు వెన్నిచ్చి పారిపోయి వచ్చినట్లు భావించిన నెల్లూరు ప్రజ ఖడ్గతిక్కనను హేళన చేస్తారు. తిక్కన భార్య మంచం అడ్డం పెట్టి, పసుపు ముద్ద ఏర్పరచి, ఆడ వారికిలా స్నానం ఏర్పాటు చేస్తుంది. తల్లి విరిగిన పాలు

యిస్తుంది. ఈ అవమానాలు భరించలేక ఎక్కువ సైన్యం తీసుకొని ఖడ్గ తిక్కన యుద్ధానికి పోతారు. ద్విగుణీకృత బలంతో వచ్చిన ఖడ్గతిక్కనను ఎదిరించటం అసాధ్యమని, కాటమరాజు అధర్మయుద్ధంలో ఖడ్గ తిక్కనను వెన్నుపోటు పొడిపిస్తారు. నేలకూలిన ఖడ్గతిక్కన శక్తిని పుంజుకొని లేచి కాటమరాజును వెంటాడి ఆయన శిరస్సు నరికి మనుసిద్ధి రాజు పాదాలకు కానుకగా సమర్పిస్తారు. వీరస్వర్గ మలంకరిస్తారు. ఖడ్గ తిక్కన కార్యదీక్ష, వీర జీవితము, మాతృభూమి సంరక్షణ ఈనాటికీ ఆదర్శంగా నిలిచాయి. ఖడ్గ తిక్కన అమరజీవి.

అందరూ నెల్లూరీయులే నటించిన ఈ నాటికలోని పద్యాలను ఆగస్త్యరెడ్డి వెంకురెడ్డి రాయగా గ్రిద్దలూరు గోపాలరావు దర్శకత్వం నెరపారు.



'ఖడ్గ తిక్కన' నాటకంలో నటించిన నటులలో ఎడమ నుంచి కూర్చున్న వారిలో కోటీశ్వరి దేవి, పొన్నాల రామసుబ్బారెడ్డి, గ్రిద్దలూరు గోపాలరావు, ఎ. రఘురామయ్య, డి. శ్రీనివాస రావు, పి. చంద్రసేన, నిల్చున్న వారు ఏ. లక్ష్మి కాంతబాబు, వెంకటేశ్వర రావు, పి. సుందర రామయ్య, శ్రీధర్, షరీఫ్

## సింహపురి

(4 పేజీ కొరవ)

గ్రంథాలయంలో ఒక సెమినార్ నిర్వహించింది. రాష్ట్ర ఉపాధ్యాయుల సమాఖ్య జిల్లా కార్యదర్శి కె. సుబ్బారెడ్డి అధ్యక్షత జరిగిన సదస్సులో శ్రీమతి ఉషారెడ్డి, ఎ.వి. కృష్ణన్, బి. సీతారామ శాస్త్రి, న్యాయవాది అనంతకృష్ణ తదితరులు మాట్లాడారు. అశ్లీలత హింసాయుత పోకడలను వ్యతిరేకిస్తూ, తగిన సూచనలిస్తూ సెన్సార్ బోర్డు, పత్రికా యాజమాన్యాలకు పుత్తరాలు, వ్యాసాల ద్వారా నిరసన తెలపాలని నిర్వహించారు.

### వేద పండితునికి సన్మానం

వేద పండితులు శ్రీ అవధానం సుబ్బు నరసయ్యకు 70 ఏళ్ల నిండిన సందర్భాన్ని పురస్కరించుకొని 16 తేది ఆంధ్రసభలో ఆయన విద్యనభ్యసించిన శిష్య బృందం ఘనంగా సన్మానించారు. శ్రీ నరసయ్య గతంలో కస్తూరి దేవి విద్యాలయం, ఎ.బి.ఎం. హై స్కూళ్లలో తెలుగు పండితునిగా పనిచేశారు. పదవీ విరమణ తరువాత ఎంతో మందికి వేదం బోధించారు. దానికి గుర్తుగా శిష్య బృందం బంగారంతో చుట్ట బడిన రుద్రాక్ష మాల బహూకరించి భక్తి భావం తెలుపుకొన్నారు.

### నెల్లూరులో కంచి స్వామి శతజయంతి ఉత్సవాలు

కంచి కామకోటి పీఠాధిపతి జగద్గురు శ్రీ చంద్రశేఖర సరస్వతి స్వామి శత జయంతి ఉత్సవాలు జనకళ్యాణ సంస్థ ఆధ్వర్యంలో ఘనంగా జరిగాయి. ఈ సందర్భాన్ని పురస్కరించుకొని షిర్డి సాయిబాబా మందిరంలో నిర్వహించిన సభకు రోటేరియన్ శ్రీ కొండా బలరామిరెడ్డి అధ్యక్షత వహించారు. సనాతనధర్మం అనే అంశం పై ఉపన్యసించిన శ్రీ ఇలపావులూరి కామేశ్వర రావు సనాతనం అంటే ముందు ఏమి లేనిది ప్రాచీనమైనదని నిర్వచించారు. కంచి స్వాముల వారికి ప్రీతిపాత్రమైన కొన్ని త్యాగరాజ కృతులను ఆలపించి శ్రోతలను ముగ్ధులను చేసారు. ముఖ్య అతిథిగా విచ్చేసిన గండిపాళెం ఆనంద శ్రమాధిపతి ప్రసన్నానందస్వామి మాట్లాడుతూ ఏనుగు పాదంలో అన్ని జంతువుల పాదాలు ఇమిడి వున్నట్లు, సనాతన ధర్మంలో అన్ని మతాలు ఇమిడి వున్నాయన్నారు. చిత్తూరు తపోవన ఆశ్రమాధిపతి బోధానంద స్వామి, రాజమండ్రి సాధు స్త్రీల ఆశ్రమం మాతాజీలు బాయమ్మ, గాయత్రి, పినాకినీ బేవరేజస్ ఎం.డి. జి. చిదంబరం కార్యక్రమంలో పాల్గొన్నారు. వక్త ఇలపావులూరి కామేశ్వర రావు పినాకినీ బేవరేజస్ చిదంబరం సన్మానించారు. చివరన సంస్థ కార్యదర్శి సర్వేపల్లి జగన్నాథ రావు వందనాలు చెప్పారు.

### ముగిసిన సుందరకాండ సప్తాహం

రాయాజీ వీధిలోని శ్రీ ఆంజనేయ స్వామి వారి దేవస్థాన ప్రాంగణంలో శారదా సాహితీ సంస్థ ఆధ్వర్యంలో సుందరకాండ సప్తాహ కార్యక్రమం ఘనంగా జరిగింది. తొలిరోజు సభకు వాకాటి పెంచలరెడ్డి అధ్యక్షత వహించారు. డాక్టర్ అమృతవాక్కుల శేష కుమార్ వాల్మీకి రామాయణం, తులసీ రామాయణం, అద్భుత రామాయణం, భాస్కర రామాయణం, మొల్ల రామాయణం గ్రంథాలలోని సుందరకాండ ప్రాశస్త్యాన్ని వివరించి శ్రోతలను ఆకట్టుకొన్నారు. ఎనిమిది రోజుల కార్యక్రమం అనంతరం జరిగిన ముగింపు సభలో పోలూరి హనుమజ్జానకి రామశర్మ, డాక్టర్ శేష కుమార్‌ను పట్టు వస్త్రాలతో సత్కరించారు. హనుమజ్జానకి రామ శర్మకు నిర్వాహకులు పట్టు వస్త్రాలు బహూకరించారు. చివరన అగ్రా కృష్ణమూర్తి గానంతో కార్యక్రమం ముగిసింది.

### ఒరేపల్లి సంతాప సభ

నిజాయితీ పరుడైన రాజకీయవాదిగా పేరుగాంచిన మాజీ జిల్లా ప్రజా పరిషత్ ఛైర్మన్ ఒరేపల్లి వెంకట సుబ్బయ్య మరణానికి చింతిస్తూ సానుభూతి తెల్పను అంబేద్కర్ భవన్‌లో 20 తేది సాయంత్రం సంతాప సభ జరిగింది. అంబేద్కర్ మిషన్ ఆధ్వర్యంలో జరిగిన సభలో పలువురు వక్తలు ఒరేపల్లి సేవలు కొనియాడారు.

### భరత నాట్యం, పాటల పోటీలు

చైతన్య ఆర్ట్స్ అకాడమీ సంస్థ ఐదవ వార్షికోత్సవాన్ని పురస్కరించుకొని టౌన్ హాలులో జూన్ 12 తేదిన రాష్ట్ర స్థాయి భరత నాట్యం సినిమా పోటీలను నిర్వహిస్తున్నారు. భరత నాట్యం పోటీలను సీనియర్, జూనియర్ విభాగాలు చేసి పెడతారు. అదే విధంగా పాటల పోటీలను స్త్రీ, పురుషులకు వేరుగా నిర్వహిస్తారు. విజేతలకు మంచి బహుమతులి ఇస్తారట. వివరాలకు 10/187, సంతపేట, నెల్లూరు చిరునామాకు సంప్రదించవచ్చు.

జమీన్‌రైతు
సంవత్సరచందా రూ. 100/-
ఆరు నెలలకు రూ. 50/-
విడిప్రతి రూ. 2.00

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zamin Ryot Press, Nellore. OFFSET Printing at Nayagara Books (P) Ltd.